

నల్లంతిఘళ్ చక్రవర్తుల
తంయాల లక్ష్మీనృసింహాచార్యులవారు
గ్రంథకర్త.

# తొలి పలుకు

ఆశీనవరూపశేఖరులారా !

ఈ ప్రబంధమిప్పటి కిరువదైదు వత్సరముల క్రిందటనే నెరవేరెను. కావ్యరచన కిదియే నూతనప్రవృత్తి యగుటచే, (ప్రమాదో ధీమతామపి) యను న్యాయానుసారము, ప్రమాదములుండునను సంశయంబున ప్రచురింప నిచ్ఛబొడమకుండెను. క్రమక్రమముగా ఇంక కొన్ని గ్రంథములు విరచింపగలిగినందులకు మిత్రులెందరో యీ గ్రంథముద్రణకై ప్రోత్సాహమొసగించిరి. సవరింపులు కానందున గ్రంథముద్రణానుకూల ద్రవ్యాభావంబున కాలవిళంబనమయ్యెను. నా కాలంబున పండితపుంగవులీ పొత్తమును వీక్షించి ముద్రణప్రయత్న ప్రోత్సాహమొనరించిరి. వారి నాగ్రహము తప్పనిసరి అట్టి తరుణంబుననే ముద్రణద్రవ్యం బొసంగెదమని కటకం నృసింహ వీరన శ్రేష్ఠులు, వాగ్దానమొసర్చిరి కాని నాగృహపరిస్థితులచే వత్సరద్వయకాలంబతీతమైనది. అది మొదలీవరకు మరలి కావ్యమును ముద్రణస్థితిలోనికిఁ దెచ్చి ముద్రింపగలిగితిమి.

ముద్రణసమయమున మేము స్థానాంతరస్థితులమగుటచే సవరణ బహుళమైనను ముద్రణస్ఖాలిత్యము లుండునుగాన పాఠకులు యథామతిగ సంప్రతించు కొనప్రార్థితులు.

ఇట్లు విన్నవించునది
గ్రంథకర్త, నివాసస్థానము
ఓరుఁగల్లు.

# పీఠిక

శ్లో॥ అపారేకావ్యసంసారే । కవిరేకః ప్రజాపతిః ।
యథాస్మైరోచతే విశ్వం । తథేదంపరికల్ప్యతే ॥

రసికవతంసులారా,

కావ్యప్రపంచము నిరవధికమైనది. కవి తనమనశ్శక్తి ననుసరించి కవితాశిల్పకళ నుపదేశించును. కవీంద్రుఁడు తన మనోరథము ననుస రించి విధాతవలెఁ గావ్యప్రపంచము నిర్మించును. కవులకల్పనాశక్తి ప్రతిభాతరంగముల నూగులాడుచుండును.

శ్లో॥ శృంగారీ చేత్కవిఃకావ్యే । జాతం రసమయంజగత్ ।
సచేత్కవిర్వీతరాగో । నీరసంవ్యక్తమేవతత్ ॥

కవి శృంగారరస పరతంత్రుఁడైన కావ్యములుగూడ శృంగార స్రవంతి ననగాహన మొనర్చుచుండును. కవి విరాగియైనచో గావ్య ములుగూడ నీరసముగా నుండును. నీరసముగా నుండు కావ్యములు సహృదయహృదయరంజకములు కానేరవు. చమత్కృతిరహితములగు కావ్యములు తృణపురుషసదృశములు.

పాఠకులకు హృదయానందము నొసంగి నీతిని బోధించునవియే యుత్తమకావ్యములు. ఏ విధముగనైనను సుకుమారమతులకు నీ తిని బోధించుటయే కావ్యరచనా ప్రయోజనము.

దృశ్యములనియు, శ్రవ్యములనియు, కావ్యములు రెండువిధ ములు. నటకులచేత రంగస్థలమునందు ప్రదర్శింపఁగినవి దృశ్యములు. వినఁదగినవై ప్రదర్శనానర్హములై వెలయు పురాణములు, ప్రబంధ ములు, శ్రవ్యకావ్యములు ఇవి పండితుల పాండితీచాతురికి నికషోపల ములు. అష్టాదశవర్ణనా సహితములగు కావ్యములు మహాకావ్యకక్ష్య నధిరోహించును.

ఆంధ్రభాషాయోషకు భాషాంతరీకరణమున నిరుపమానసామర్థ్యము గలిగిన కవిత్రయము పెట్టినదే యాదిభిక్ష. ప్రబంధపరమేశ్వరబిరుదంబు ధరించిన యెఱ్ఱాప్రెగ్గడనంతట కవు లనేకు లది మొదలుకొని తమ కవితాకన్యకను ప్రబంధడోలికలం గూడా నయ్యాలలూపుటకై యెల జూపనాగిరి. కూచిమంచి తిమ్మకవి మొదలగు కవీంద్రులు మిశ్రప్రబంధములనే గాక యచ్చతెనుఁగు ప్రబంధముల సహితము రచించి యశశ్శాలులైరి. పురాతన కవి తిలకుల యాశీర్వాదమే, వారిసయూరసమే, యధునాతన కవిశేఖరుల కాలంబనము ; ఆంధ్రభాషాలలామను జీవగఱ్ఱ.

మిశ్రబంధరచనకన్న, నచ్చతెనుఁగు పలుకుబడులచే చిత్రితమగు కావ్యరచన, మిక్కిలి కష్టము. కావుననే నంతర్వాణేంద్రులకది సరస్వతీ పీఠము.

## గ్రంథకర్తృ ప్రశంస.

అచ్చతెలుఁగు ప్రబంధము సిరికిష్ణకృష్ణవిలాసమును రచించిన కవినాథులు శ్రీమాన్ స్నఫ్ఫింతిఫుల్ చక్రవర్తుల, తిరుమణ్యాల, లక్ష్మీనృసింహాచార్యులవారు, వీరికి, తిరుమణ్యాలయని, బిరుదనామము. వీరి నివాసము, వరంగల్లు. గోత్రము, హారితసగోత్రము. జనకుఁడు రంగాచార్యులవారు. వీరు వేల్పుగొండ లక్ష్మీనృసింహస్వామి కరుణాకటాక్షలబ్ధవాగ్విభవానుభావులు, ఆంధ్రభాషాప్రవీణులు, చతుర్విధకవితాప్రబంధరచనా నిర్మాణధురీణులు. ఈ విషయమంతయు నాశ్వాసాంతగద్యవలన స్ఫుటమగుచున్నది. వీరీ యచ్చతెనుఁగు ప్రబంధమునే కాక నిరోష్ఠ్యాద్యేతర గ్రంథములనుగూడా కొన్ని రచించిరి. వీరి కవితాశైలి సులభశైలి. పండిత పామరజనమున కానందమొసఁగును. పురాతనకవీశ్వరుల పోకడలు వీరి గ్రంథంబున గన్పించుచున్నవి.

ఈ కుబ్జాకృష్ణవిలాసమునందలి ద్వితీయాశ్వాసము నందలి వర్ణనాంశములు, తృతీయాశ్వాసము నందలి కూర్మబంధము, మద్దెళబంధము, ఖడ్గబంధము, మొదలగు బంధవిశేషములును, గర్భితమైన చతుర్విధకందములును, కందగర్భ చంపకమాలావృత్తము మున్నగు వృత్తవిశేషములును వీరి పాండితీవైభవమును జాటుచున్నది.

(కుబ్జావృత్తాంతము)

మధురాపత్తనమును నుగ్రసేనుడు పరిపాలించుచుండెను. ఆతని పెద్దకొమారుఁడు కంసుఁడు. అతనికి నూడిగముసేయు దాసి కమల. దీనిభర్త కోమల్లుఁడు. ఈ దంపతులు సంతానములేక తపోవనంబున నున్న గర్గమహర్షి చెంతకుఁ జని, యతనివలన తనకొక కుమార్తెగలుగుననియు, శ్రీకృష్ణుఁడు వరించుననియు, విని సంతసించి తిరిగి గృహంబునకు జనుదెంచి పిదపఁ గొన్నిదినంబులకుఁ గమలగర్భవతియై సుముహూర్తమున నొకకూతును గనెను. ఆబాలికామణిపేరు కుబ్జా.

(కుబ్జాపూర్వవృత్తాంతము)

కుబ్జా మువ్వంకలు గల శరీరముకలది, ఈ బాలిక పూర్వజన్మమున, రావణుని చెల్లెలగు శూర్పణఖ. శూర్పణఖ పంచవటియందు శ్రీరామచంద్రుని మోహించి తనను వరింపుమని యనేకవిధంబుల వేడుకొనెను. కాని యప్పుడాతఁ డంగీకరింపలేదు.

శూర్పణఖ పతివ్రతాలలామయగు సీతాదేవిని మ్రింగబోవఁగా లక్ష్మణుఁడు, శూర్పణఖ ముక్కుచెవులు ఖండించెను. అంతశూర్పణఖ విచారపడి, దుఃఖించుచు రావణునిచెంతకుఁ జని, తనవృత్తాంతమును, విన్నవించి, జానకీసౌందర్యముల వర్ణించి. వైదేహియందు, దశముఖుని కనురాగము కల్పించి తాను తపంబున కేగెను.

పుష్కరతీర్థమున శూర్పణఖ పదివేల వత్సరములు, శివునిగూర్చి ఘోరతపంబొనర్చెను. ఈమె తపంబునకు మెచ్చి, శివుఁడు

ప్రత్యక్షమయ్యెను. శూర్పణఖ లోకాభిరాముడగు శ్రీరామమూర్తిని
నాకు భర్తగా నొసంగుమని వరం బడిగెను.

శివుండా యువతినిజూచి, శూర్పణఖా, ద్వాపరాంతంబున నీ
రాముడే కృష్ణుడుగా నవతరించి నిన్ను చేపట్టగలడు. విచారపడకు
మని వరంబిచ్చి అంతర్హితుడయ్యెను. ఇది కుబ్జాపూర్వవృత్తాంతము.

ఆ కారణముననే శ్రీరాముని యవతారమగు శ్రీకృష్ణుడు,
మధురాపట్టణమున దేవకీవసుదేవులకు, జన్మించి, యశోదాదేవి ప్రేమ
సర్వస్వమై, మనోహరములగు లీలలచే, నా బాలగోపాలము నానందా
బ్ధిలోమునుంగ జేసెను.

ఒకనాడు కుబ్జ కంసునికి సుగంధద్రవ్యములు తీసుకొని వెళ్లుచుం
డెను. అప్పుడే రాజమార్గంబున కంసునిచే నాహూయమానుండై శ్రీ
కృష్ణుండగ్రజసహితుండై గోకులమునుండి విచ్చేయుచుండెను.
కుబ్జ తన యపాంగప్రసారములు కృష్ణునిపై బఱపి యాతనిని
పరిమళద్రవ్యములు గైకొనుమనెను. అతడు గ్రహించెను.
శ్రీకృష్ణుడు, ముప్పంకలుగల కుబ్జయొడలు, చక్కగ నొత్తదలచి,
తత్పదంబులమీద తన పాదంబులనునిచి హస్తాంగుళి ద్వయమాత్ర
మా యబల నడుముద్రొక్కి నిడి మీదికి తేపనెత్తగా కుబ్జ
వక్రత్వము వీడి సుందరమూర్తియై నిలిచెను. కుబ్జకు కృష్ణునిపై
మోహమది మొదలతిశయించెను. గృహమునకు వచ్చి విరాళి
గొని మదనబాధ సహింపజాలక పద్మినియను దూతికను కృష్ణునిచెం
తకు బంపించెను. కృష్ణుడే తెంచి, కుబ్జమనోరథము తీర్చెను. ఇది
యీ గ్రంథమందలి కథ.

## కవితాశైలి.

ఈ కుబ్జాకృష్ణవిలాసము భగవద్భక్తుడగు బమ్మెరపోతరాజుచే
రచియించబడిన భాగవతము నందును, గర్గభాగవతమునందును గలదు.
పదిపద్యములతో పై గ్రంథములయందు నుడువబడిన, యీ కథ, యీ

ప్రబంధమునందు మూడాశ్వాసములలో ముచ్చటగా నభివర్ణింపఁబడినది.

కమలాకోమలులు, గర్గమహర్షి చెంతకు జని, తనపూర్వవృత్తాంతము, నడిగి తెలుసుకొను సందర్భమున, కుబ్జాకృష్ణులపూర్వవృత్తాంతమును, మధురములగు కృష్ణలీలలను వర్ణించుటజూడ గ్రంథకర్తృసమయోచితకల్పనా చాతుర్యము వ్యక్తమగుచున్నది.

మఱియు నాయాసందర్భములందు దశావతారములను, సుకుమారపద గుంభనముచే నుడువుటయు, మూలగ్రంథములలో లేని దూతికాకల్పనము గల్పించుటయు, నాలోచింపఁ బై విషయమునే ధృవపఱచుచున్నది.

కవితాశైలి పండితపామరహృదయంగమమై కవియొక్క రచనా నైపుణ్యమును, భావగంభీరతను, బోధించు చున్నది. ప్రాచీనకవితల్లజులత్రోవ ననుసరించి యిందు పురవర్ణనము, స్త్రీవర్ణనము, వనవిహారము, జలక్రీడ, మన్మథోపాలంభనాది వర్ణనములు, సరసులహృదయములు నాకర్షించునట్లుల రచింపఁబడినవి.

ఇందలి రసము, శృంగారము, అది కుబ్జామనోగత రత్యుపాధికమై గోపీలోలుఁడగు శ్రీకృష్ణుని యాలంబనము గలిగి కుబ్జాకటాక్షాద్యను భావసమ్మిళితమై జౌత్సుక్యాది వ్యభిచారి భావపరిపోషితమై వనవిహారాద్యుద్దీపన విభావసముజ్జృంభితమై సమగ్రముగ నిందు సాధించఁబడినది.

ఇట్టి యత్యుత్తమమగు యచ్చ తెనుఁగు ప్రబంధమును రచించిన గ్రంథకర్తృ కవితా ప్రాశస్త్యము దెలియుటకై, మచ్చునకొకటి రెండుదాహరణము లొసంగెద.

క. చెందొవలఁ దూఱుకన్నులు
కెందమ్ములఁ గ్రేణిసేయు గేరెడడుగులున్

చందురు బురణించెడు మో
మందముగల చెలినిజూడ § నబ్బురమయ్యెన్.

క. విండ్లాబొమ్మలు తమ్ములు
తూండ్లా కేల్ దోయి మిసిమి § తోరంబగు పూ
చెండ్లా గుబ్బలు మెత్తని
దిండ్లాలలి పిరుదులలరు § తెలియగ దలపన్.

తే. గీ. చెలువలిద్దరు పువ్వుల § చెండులాడు
తరినొకట్టె నొక్కరితపైట § దవిలిజిక్క
మూడుపాలిండ్లు గలిగిన § ముగుదయనుచు
పొలతులందరు నవ్విరి § పొలుపులెసగ.

క. డాలాపిక్కలు క్రొంగన
డాలాకెమ్మోవి § తమ్మిడాలాయడుగుల్
డాలామూడ్కులు నునునవ
రాలాజడతీవి బొంగ § రాలా చన్నుల్.

ఈ విధము రసవంతముగ, నీప్రబంధమును రచియించిరి. మరియు నిందలి (73) పేజీయందలి, గద్య, ప్రాచీనులగు, నచ్చతెనుగు ప్రబంధ కర్తల, ధోరణి నతిశయించు చున్నదా యను విభ్రాంతిని, పాఠకులకు గల్గించుచు, గమ్మెచ్చున దీసినటుల సుకుమారములగు నచ్చతెనుగు జానుపలుకుబడులగు బాళించుచు, మనోరంజకమై యొప్పారుచున్నది. ఇటులే (100) వ పేజీయందు వచనరచనయు, (109) వ పేజీయందలి దండకము, కుడియెడమగా దీని ననుకరించు చున్నవి.

ఈ కాలమున నచ్చతెనుగు ప్రబంధముల రచించువారలే యరిదిగా గన్పట్టెడిని, అందున నీ యాచార్యులవారు మిక్కిలి శ్రమ పడి ఇట్టి యుత్తమగ్రంథమున, నచ్చతెనుగున రచించి, యాంధ్రభా

షానధూటీ పాదపద్మముల నొక సువర్ణాభరణము, నొసంగి యమూల్యసేవఁజేసి సందులకాంధ్రమహాజనుల కెల్లరకు శ్లాఘనీయులు. వేల్పుగొండయందు భక్తుల నుద్ధరించుటకై, యవతరించిన లక్ష్మీనృసింహస్వామి, వీరి కాయురారోగ్యైశ్వర్యముల నొసంగి, వీరికి గ్రంథరచనాకౌశలమును, నిత్యాభివృద్ధిగా నొనర్చుగాత.

| | |
|---|---|
| 28-11-32 | ఇట్లు |
| సంస్కృతవిద్యాశాల | బుధజనవిధేయుడు |
| ఓ రు గ ల్లు | విద్వాన్ ముదిగొండ వీరేశలింగశాస్త్రి |

# పీఠిక

(దాతృ ప్రశంసా)

క. శ్రీకినికాపురమై వి
ప్రాకలితం బై యనేక ♦ హరిహరభవన
స్తోకంబై సంతతశుచి
కాకరమై యోరుగల్లు ♦ పావణించె భువిన్.

గీ. సరగను ప్రతాపరుద్రభూ ♦ జాని భుజబ
లావనత నొందియుండు మ ♦ హాప్రశస్త
సంపదల కాలవాలమై ♦ సంస్మరింప
దిట్టయైయున్న యోరుఁగ ♦ ల్పట్టణంబు.

గీ. వైశ్యకులమణులు కటకంసు ♦ వంశముక్త
లఖిల సద్గుణవేదు ల ♦ త్యంతసుఖులు
గొంటకులగోత్రు లీశ్వర ♦ కోమలారు
ణాంఘ్రిసంస్మరులయ్యు పెం ♦ వందిరచట.

ఉ. ఆ పరమాన్వయంబున మ ♦ హాంబుధిగన్న సుధాంశుపోలికన్
పాపము తాపదైన్యముల ♦ బాపినకల్పక చంద్రగంగలన్
రూపునుమాపి సజ్జనుల ♦ రూఢిపదార్థుల సంతసింపుచుఁ
జూపడె ధర్మమూర్తియయి ♦ జొక్కనుబాలయసెట్టి యొక్కఁడున్.

ఉ. బాలయసెట్టి ధర్మనయ ♦ భావముల న్వెలుఁగొంది నొక్క క
న్యాలలితాంగి బెండ్లియయి ♦ న్యాయముదప్పక పుత్రరత్నమున్
బాలిమితోడఁ గాంచెలలి ♦ తంబుగ వీరనసెట్టిపేరునన్
గ్రాలిచరించె బేరములఁ ♦ గాదిలిసేసి యశంబుజొప్పడన్.

క. రతికినిసమమై (శ్రీ) భా
రతిసతుల గుణాదికముల ♦ రంజిలి భువి సం
మ్మతిఁగల్గి యల్లమాంబను
హితమతితో బెండ్లియాడె ♦ హితులు బొగడఁగ.

సీ. ఆవీరనశ్రేష్ఠి ♦ యాత్మపత్నినిఁ గూడి
పుణ్యాపగ క్షేత్ర ♦ ములనుఁ దిరిగి
సత్యవాక్ప్రియతులఁ ♦ జాలబేరము లాడి
పిన్నపెద్దలలోన ♦ పేరువడసి
దశరథ నృపువలె ♦ తనయుల నల్వుర
గనియెను పెద్ద వెం ♦ కన్న యనఁగ
చిన్నవెంకన్న నా ♦ కొలఁగి మంగయయన
తుదకు శివ్వయ యనఁ ♦ దుల్లఁదూగి

గీ. రతులవిభవ సుభోగభా ♦ గ్యముల నెల్ల
ననుభవింపుచు మిక్కిలి ♦ యార్యసభల
త్యాగరాగవిరాగ సం ♦ యోగభోగ
ములకు తావలమైరి స ♦ మ్మదముఁ గలుఁగ.

గీ. పెద్ద వెంకయ్యశెట్టి తా ♦ ముద్దియ నొక
రితను పెండ్లాడి గేస్తుబా ♦ డి తొలఁగకను
ధర్మముల ధనము వ్రయపెట్టి ♦ ధరణివెలసె
సంతతులనిత్తె నేలపై ♦ సంతుకొరకు.

వ. అందు చిన్నవెంకయ్యశెట్టి తెరంగు వినుపించెద.

సీ. ఆయతభోగ భా ♦ గ్యములకు బేరుతో
సాటియే యనుచుండ ♦ సాగె నెవఁడు
అద్రిబేరము లంచు ♦ నన్నిదిక్కుల కెల్ల
దనపేర సాగించి ♦ దనరె నెవఁడు
ఆర్జించు ద్రవ్యమం ♦ దర్ధభాగము దీసి
యర్థిసంతృప్తికై ♦ యనిపె నెవఁడు
తనయిల్లు దామర ♦ దంపమై ధనముల
జుట్టాలఁ దమ్ముల ♦ దనిపె నెవఁడు
గీ. వదలకీశ్వర భక్తితో ♦ వరలె నెవఁడు
అట్టి వెంకయ్యసెట్టి గు ♦ ణాఢ్యుఁడయ్యె
వెలసె యోరుఁగల్లున సిరుల్ ♦ విఱివిఁగ
నొక్క కోమరితతోడ దా ♦ నుల్ల సిల్లె.

క. ఆనాగరికుడు మగసం
తానము లేకునికి సప్త ♦ ధర్మసుతులపై
బూనిక సేయుచు ♦ తమ్ముని
సూనుని వీరననుఁ గొనియె ♦ సూనుని గాఁగన్.

సీ. అగ్రజునాజ్ఞచే ♦ నల్లారు ముద్దుగా
కార్యక్రమంబు మం ♦ గయ నడుచుచు
సత్యంబుఁ దప్పక ♦ సాగిన బేరముల్
జరుపుచు ధర్మవ ♦ ర్జనము లేక
నార్జించు ద్రవ్యంబు ♦ లాఱు భాగములుఁగా
పంచి వెచ్చించుచు ♦ పరమవిధిని
పెద్దలఁ బొడగన్న ♦ భృత్యుని కైవడి
వినయవిధేయత ♦ విధిగ నడిపి

గీ. సిద్ధమగుకీర్తి నలుదెస ♦ సీమలందు
వ్యాపకంబునుఁ గావించి ♦ వర్ణనముచి
తాంగనను పెండ్లియాడె ర ♦ త్యాంగనాన
దృశవిలాసిని వెంకమ ♦ స్థిరమతిని.

వ. అట్టి సతీలలామంబు.

ఉ. వీడదుభర్తపై బగితి ♦ విన్న దనంబుగ మాటలాడ మా
టాడదు పెద్దలంగని జో ♦ హారులు సల్పకయున్న వారితోఁ
గూడదు పేదసాదులకు ♦ కోరిక లిచ్చుచునన్న పూర్ణయై
యాడదు యెగ్గుమాటలుప ♦ రాధనముకై మదితృష్ణలేక తా.

గీ. అట్టిసతియందు పుంగయ ♦ సెట్టి సకల
సుగుణగణఖను లిరువురి ♦ సుదతిదుగను
గనియె వరమేశు పాదపం ♦ కజ మరంద
బిందుసందోహ పాన మి ♦ ళిందు డగుచు.

క. నరసింహసెట్టి మదినం
బరముం బెంపొంద కటక ♦ వంశజలధికిన్
పరమవిలక్షణకౌస్తుభ
ము రహించెడు వరుస జన్మ ♦ మును జెందెభువిన్.

క. ఆ వెనుక వీరనార్యుఁడు
భావిఫలప్రాప్తి కందె ♦ భవము కళావి
ర్భావముఁగ పెద్దతండ్రికి
వావిరి దత్తకుడునయ్యె ♦ వచ్చెను పిదపన్.

క. ఆయిరువు రేక పక్కిఁ గ
పాయక బేరంబులాడి ♦ బహువిధ ధర్మ
స్థాయికులై కనికరమును
దాయలయెడ నైనఁజూపి ♦ దర్పించి తగన్.

సీ. సిరులలరఁగ శర ♦ సింహాసెట్టియు వీర
సెట్టియుదారభా ♦ సిత మనముల
భూవసతుల నెల్ల ♦ బొందించి వర్తక
శాలల తనపేర ♦ సంస్కరించి
జలదానమున తృప్తి ♦ జరుగు యాతాయాత
జనుల కటంచుపై ♦ త్రనముఁ గదుర
స్థాపించి ధర్మముల్ ♦ జరుపుచు హరికథా
శ్రవణ నైపుణముల ♦ సంస్మరించి
గీ. మరియనేకధనీక శ ♦ ర్మదముఁ గలుగ
ద్రవ్యమార్జన జేసి ♦ విద్యావిశేష
మున గడించి సమగ్ర స ♦ మున్నతాతి
శయయశోభాగ్య భోగ్య వి ♦ స్తారములుఁగ.
మ. వలనున్మిక్కిలి కీర్తినిండ కటకం ♦ వంశాబ్ధిరాకాబ్జులై
నలసద్వీరనృసింహ సెట్టులు మము ♦ న్నల్లంతిఘల్ చక్రవ
ర్తుల తంయాలమహాన్వయోద్భవుల దో ♦ ర్జోబిల్చి తోడ్తెచ్చి రా
గిలుకావ్యంబున గల్గుప్రేమనను ల ♦ క్ష్మినారసింహార్యులన్.
క. మీకవితా కౌశల్యకు
బ్జాకృష్ణవిలాస మచ్చు ♦ పడఁగా ధనమున్
జేకొనుడిచ్చెదమని మఱి
వాక్రుచ్చి యశో విభూతి ♦ వర్ధిలఁగ భువిన్.
గీ. సంతసించి నేను ♦ సంతత శుభదాయ
కావ్య మచ్చునకును ♦ కావలయు ధ
నమును గొంచుకొని వి ♦ ధంబుగ ముద్రించ
గలిగితిని మనోజ్ఞ ♦ కమున సతము.

## శాస్త్ర ప్రశంసలో

| పుట. | పం. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧ | ౨ | భవన | భవనా |
| ౩ | ౮ | జుట్టాలసమ్ముల | సమ్ముల జుట్టాల |
| ౫ | ౪ | తన | తను |
| ౫ | ౧౬ | ప్రేమనను | ప్రేమగను |
| ౫ | ౨౦ | వాక్రుచ్చి | వాక్రుచ్చి |
| ౫ | ౨౩ | ధంబుగ | ధమముగను |

## ప్రథమాశ్వాసములో

| పు. | ప. | పం. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| ౫ | ౨౩ | ౯ | లచ్చికినరుదు | లచ్చికినిసరుదు |
| ౧౨ | ౪౭ | ౭ | మొలు | మేలు |
| ౧౩ | ౫౩ | ౧౨ | పరియ౦కము | పరియంకము |
| | | | సతముం | సతము |
| ,, | ౫౭ | ౨౬ | కతకా | కతనీ |
| ౧౫ | ౬౬ | ౨౧-౨౨-౨౪ | కాంద్రు | కాంద్రుడు |
| ౧౬ | ౬౮ | ౧౪ | నేటితాడి | నేటిజేడి |
| ,, | ౭౦ | ౨౦ | మన్నిమా | మన్నియుమా |
| ౧౮ | ౭౭ | ౨ | రించగకా | ధింపగకా |

| | | | | |
|---|---|---|---|---|
| ౧౯ | ౮౩ | ౧౩ | కాంచనసౌరు లొప్పు | కాంచనముల నొప్పు |
| ౨౧ | ౮౯ | ౪ | రించగ | రింపగ |
| ౨౨ | ౯౩ | ౮ | కాండృ | కాండ్రు |
| ,, | ౯౪ | ౧౬ | విస్రుష్టు | విసృష్టు |
| ,, | | ౨౧ | కాండృ | కాండ్రు |
| ౨౩ | ౯౭ | ౧౨ | నఁతమి | నతమి |
| ౨౪ | ౧౦౧ | ౫ | నాలు | యూలు |
| ,, | ౧౦౪ | ౧౪ | మెలిక | ఎలుక |
| ,, | | ౧౯ | కోల్పుల్లే | కోల్పులుల్లే |
| ,, | | ౨౩ | బోడు | జోడు |
| ౨౬ | ౧౧౪ | ౨౨ | మాకును మెఱుంగగు నాయనియొ | మాకునయ యోాయని యిస్థరము |
| ౩౦ | ౧౩౨ | ౧౦ | రాయునికి | రాయినికి |
| ౩౧ | ౧౩౬ | ౪ | ఆని | అని |
| ౩౨ | ౧౪౨ | ౭ | మననీసేక | మననసేక |
| ౩౪ | ౧౫౩ | ౧౦ | అకూ్రరు | అక్రూరు |
| ౩౯ | ౧౭౮ | ౨౩ | గావె | గావే |
| ౪౦ | ౧౮౨ | ౧౫ | మ్రాకు | మ్రాను |
| ౫౩ | ౨౪౩ | ౪ | వారీ | వార |
| | ౨౪౪ | ౮ | చిత్తరము | బిత్తరము |

## ద్వితీయాశ్వాసములో

| ౯౪-౬౦-౬౨-౬౪ | | | ప్రథమా | ద్వితీయ |
|---|---|---|---|---|
| ౭౨ | ౭౫ | ౧౭ | వేరుల | నేరుల |
| ౭౬ | ౫౪ | ౨ | కొల్చునుడు | కొల్చునుండు |
| ౮౧ | ౧౨౪ | ౧౩ | మన్నల్ | మిన్నల్ |
| ,, | ౧౨౬ | ౨౪ | తెఱవాయ | తెఱవాయి |
| ,, | ,, | ౨౪ | మెల్నడు | మేల్నడు |
| ౮౨ | ౧౩౧ | ౨౨-౨౩ | నెగ్గ | నెడ్గ |
| ౮౩ | ౧౩౭ | ౨౪ | చెక్కు | చెక్కు |
| ౮౪ | ౧౩౮ | ౯ | గవాళింపు | గరాళింపు |
| ,, | ౧౪౨ | ౨౧ | వాకల | కైకడు |
| | | ౨౧ | వదలని | కదలని |
| ,, | ౧౪౩ | ౨౨ | మంచు | మించు |

## తృతీయాశ్వాసములో

| | | | | |
|---|---|---|---|---|
| ౮౭ | ౯ | ౩ | దొడ్డగా | దొడ్డగా |
| ,, | ,, | ౯ | బల్లి | బల్గ |
| ,, | ౬ | ౬ | చందవ | చెందొవ |
| ,, | ౭ | ౧౨ | మేన | మేలా |
| ,, | ౧౧ | ౨౪ | పయ్యోద | పయ్యోర |
| ,, | ,, | ౨౬ | నేమ | నేమి |

| | | | | |
|---|---|---|---|---|
| ౮౯ | ౧౯ | ౬ | దోడ్ని | గోచి |
| ౯౧ | ౩౪ | ౧౯ | యజ్ఞిను | ఝజ్ఞిను |
| ,, | ౫౫ | ౨౧ | మను | మాను |
| ౯౩ | ౪౧ | ౪ | నిలువ | నిలుప |
| ౯౮ | ౯౨ | ౨౩ | చేయ | చేయి |
| ౧౦౧ | ౧౦౩ | ౩ | పీన | పీడ |
| ,, | ౧౦౪ | ౧౬ | చెడుగ | నేడుగ |
| ౧౦౨ | ౧౦౬ | ౫ | జల్లేడదూందిచ | జల్లేడుదూందిచ |
| ,, | ,, | ౧౮ | ద్రొచ్చిన | ద్రొబ్బిన |
| ,, | ,, | ౨౩ | నత్తం | నంత |
| ౧౦౭ | ౧౨౬ | ౨౧ | పడుకో | పడుకా |
| ౧౦౮ | ౧౨౮ | ౧౮ | తేలురున్ | తేరులున్ |
| ౧౦౯ | ౧౨౮ | ౨౫ | మెల్నాటి | మేల్నాటి |
| ౧౧౦ | ౧౩౧ | ౧౫ | గాక | గాగ |
| ౧౨౦ | ౧౫౫ | ౨౫ | దూలి | దూలిన |
| ౧౨౪ | ౧౭౨ | ౧౭ | వలతా | వలరా |
| ౧౨౭ | ౧౮౭ | ౯ | బాయ | చాయ |
| ౧౨౯ | ౧౯౪ | ౯ | మెల్నాడు | మేల్నాడు |

(శ్రీమతే రామానుజాయనమః)

(శ్రీలక్ష్మీనృసింహ పరబ్రహ్మణేనమః)

శ్రీ విష్వక్సేనాయనమః॥

# అచ్చతెనుఁగు కుబ్జాకృష్ణవిలాసము

## (ప్రథమాశ్వాసము)

శ్రీలఁదొలంగి జాలిమెయి ♦ జేజెలుకుయ్యిడ నాలకించి తా
మేలుగఁ గంబమందు పొల ♦ మేకరియక్కునఁ జీరఁబట్టి పై
డాలము మానివేల్పుల బి ♦ డారు లొసంగి జగమ్ముఁగాచి యు
న్వేలుపుఁ గొండతావుఁగొని ♦ వెల్గెడు సింగని నేదలంచెదన్. ౧

చం. కసటుఁదొలంగి పోవఁగను ♦ గ్రన్నన నెమ్మది నేదలంతునీ
రసనెడఁబాసి పక్కిదొర ♦ రా తెదయే చిగురాకుబోఁడి మే
ల్పసకడకంటి చూపులకు ♦ వాలెములోఁబడి కూర్మితోడ బా
నిసిషులఁబ్రోచు నాకలిమి ♦ నెల్తు కహూజ్జగవన్నతంబుగన్. ౨

ఉ. క్రొంచకబత్తిమీర బలుఁ ♦ గొమ్ముల మేటిమెకంబుఁబ్రోవ ర
మ్మంచును నల్లమేనిదొర ♦ కంజలిఁ జేసిన యూనవొంచి మే
లెంచఁగవచ్చి యమ్మొనలి ♦ యేపణగించి వలన్వెలంగు పేఁ
యంచులకైదువుల్ దలఁతు ♦ హానుఁజెలంగఁగ బాములారఁగన్. ౩

గీ. పొలనుమేతరి వెలఁదులఁ ♦ బొట్టనున్న
గ్రుడ్డుల వియంగ వేల్పుల ♦ యొడ్డలుబ్బి
సొంపుమీరంగ రొదసేసి ♦ సోకుగొంగ
దాకయుని వెల్గువలముఁగీ ♦ దలఁతు సతము. ౪

ఆ. కావలపుడాయ తెంపరి ♦ కానలకును
కనలుకారగ్గియైయొప్పి ♦ గట్టుదాల్పు
కై పిసాళింపఁగల నంద ♦ కమును బత్తి
మీఱ మదిలోనఁ గోరిక ♦ లూరఁదలఁతు. ౫

ఉ. మేలిమినారి నాదుకుము ♦ మేఁటిరువాణము మెప్పుదానిచే
వ్రాలులకోరి వానయు జ ♦ వంబున జేజెలవాన కోయిలల్
గ్రాలఁగ వేల్పుదాయలవ ♦ గన్మడియింపుచు లచ్చిరేనికై
వాలెమునిల్పు శార్ఙ్గమను ♦ బాజు మొగుల్దలకట్టు నెంచెదన్. ౬

ఆ. బాసవాళ్ళనెల్ల ♦ బాములనొందగ
నేయుతుంట రక్క ♦ సీఁడుమూక
లడరనీల్గఁ దిరిగి ♦ నాలచ్చి చెలికాని
కేలనలరు గుదియఁ ♦ గేరిదలఁతు. ౭

ఆ. పడుకటిల్లు గొడుగు ♦ పావాలు పదియూరు
వన్నెపశిడిసాలు ♦ చిన్నిపీట
మొదలు పలువితాల ♦ మదిమది మెలఁగిన
పుడమి తాల్పు నెపుడు ♦ కడుదలంతు. ౮

కం. నెమ్మది కతిదేవరకను
బొమ్మంగల సన్నయానముజ్జగముల బె
త్తమ్మును చేకొని బ్రోచుచు
దిమ్మరు సూత్రవతి మగని తిరముగఁ గొలుతున్. ౯

ఉ. గ్రక్కున వేల్పురేని తొలి ♦ కంటుతనమ్మును చూపులాగునన్
తెక్కులులేని మెట్టులమ ♦ తిన్నెను గ్రద్దల గొండ్లితీరుగన్
జక్కపడంగ సేయదగు ♦ సత్తువ రెక్కల గాలివీచు నా
పక్కులసామి యంజలను, బల్మరు వేడెద నిచ్చతీరఁగన్. ౧౦

గీ. పుడమిపుట్టువు సుందర ♦ మునసు మున్ని
కూలుచున్నట్టి ప్రజలకు ♦ మేలు తెలిపి
తెప్పచేలేపి కడుమఁగి ♦ తిని నొసంగు
కారిమారి కొమారుని ♦ కఱఁకఁదలతు. ౧౧

చం. ముసిముసి నవ్వు మిమ్మతిలు ♦ మోమును వాఁడము కొఱమబ్బు పెం
పెసగిన కీలుగంటునన ♦ కీడగు మోవి పసిండిచిగ్గులన్
బొసగిన మేనునిబ్బరిక ♦ మున్గలకన్గవమేల్ గొనాలకున్
బసయయి పోల్చుకాంతిమతి ♦ పట్టిని నెన్నెద బుద్దితొమునన్. ౧౨

కం. మూటిఁగల కుమ్మఁ దెలిసియు
మూటిని విడనాడి యెడఁద ♦ మురయుచు వేము
మ్మూటి మనహాపు తొమయి
పాటిలు మణవాళరుసిని ♦ వాలెము గొల్తున్. ౧౩

ఉ. ఉల్లములోన నెంతుమది ♦ నొక్కెడ సేసియు బత్తినప్పకే
త్రొల్లిటి బాములంబొడము ♦ దోసములంగడజిమ్మ బైజక
ప్పెల్లదలిర్పనున్నయిడి ♦ యెక్కుడు కోర్కులుఁదీసి ముత్తిరం
పిల్లఁగఁజేసి యగ్గలిక ♦ పిక్కటిలన్ గల రంగభట్టుకున్. ౧౪

గీ. బుడుత చెయ్వులగడుకడ ♦ బుచ్చిపగ్గె
నెఱపి తిలకింపజేసియు ♦ నీటుకైత
లక్కనము నేరిపినయొజ్జ ♦ లమదరూరి
లక్ష్మణార్యుల మదిలోఁ ద ♦ లంతు నెపుడు. ౧౫

ఉ. తుంటతనంబు సంగసటు ♦ తుందుడుకుల్గల కొఱ్ఱివ్వదంబులన్
కంటువు మట్టుపుంగలుఁగఁ ♦ గం దిరుగాడుచున్న నన్ను నా
వంటి మెకంబులన్మలిపి ♦ వాలెము మంతనమెల్లఁ జెప్పి మే
లంటగసేయు బత్తిగను ♦ కైదగు పెద్దల నెంతు నెమ్మదిన్. ౧౬

కం. చనువున సీరాముని కత
లను వేలుపుఁ బాసలోన ♦ లలిఁ గుల్కఁగ జే
సిన పుట్టఁబుట్టు గుఱుసిని
గొనియాడెద గబ్బమునకు ♦ కోల్కొనఁగ సిరుల్. ౧౭

కం. పెనుమినుకులఁ గలిగిన చి
క్కనుఁ బోకడఁ జేసి నాలు ♦ గు తెఱఁగుల నే
ర్పున నేరుపఱచు వ్యాసుని
జనువిగురొత్తంగఁ దలఁతు ♦ జక్కని నుతులన్. ౧౮

కం. గుబ్బకొను లక్క నంబుల
జబ్బనుపడ సిరిమేలు, నతవితములచే
గబ్బములు నుతవ కలిగిన
కబ్బపుఁగూర్పరులఁ దలఁతు ♦ కలికి నుడువులన్. ౧౯

ఆ. మంచియొడలి విడచి ♦ మఱిపుంటిచోటున
నీఁగ వ్రాలుతీరు ♦ బాగమైన
యొప్పులెల్ల విడచి ♦ తప్పులచేకొను
కూళగమిని దలఁప ♦ నేల మదిని. ౨౦

వ. ఇట్లు నిచ్చవేలుపుల గొనియాడి కబ్బముఁ జేయు పెద్దలం బత్తి జేసి కూళల నీసడించి వెండియు నావంగడంబు దెలియఁజేయుదు. ౨౧

సీ. హారీతుఁడను జడ ♦ దారి కొలంబున
బుట్టి సింగర గురుడట్టె నెగడి
తోలుఁదొర్త్తనల్లంతి ♦ ఘుఘుచక్రవర్తుల
యను నింటిపేర పె ♦ ర్త్తనముఁ గదుర
మనివేల్పు గొండయం ♦ డను గలమానిసి
సింగనిఁ దాపునఁ ♦ జేరితబము

గావించి వగ్గలుఁ ♦ గలిగి రచ్చలయందు
విద్దెలచే మెప్పు ♦ వెలసి యొగ్గ

గీ. నెక్కు రాదారి విచ్చేయు ♦ నేలికయగు
ధంసజేతున కెమర నె ♦ గ్గసపు నిలచి
తెలుఁగు మొదలైన యైమకా ♦ నలను కబ్బ
మల్లి రంయూల బిసనంబు ♦ నందుకొనియె. ౨౨

గీ. అట్టి రంయూల బిరుదంది ♦ యతివ యైన
లచ్చికి నరుడుఁ గలిగిన ♦ లక్ష్మయందు
పాల మున్నీరుగన్న జే ♦ జేలబువ్వ
వలె నృసింహాక్యగనియె జె ♦ ల్వొంబుగులుక. ౨౩

ఉ. ఆ నరసింహ దేసికుడు ♦ నబ్బపు విద్దెలయందు దిట్టయై
మానిసి సింగనిమ్మదిని ♦ మానక రేడుల రచ్చలందు వి
న్నాణపు దొల్లిపొత్తముల ♦ నమ్మకమున్ వెలయించి పెద్దయై
దానెద గేస్తు వాడిని న ♦ తంబుగఁ జేకొననెంచి పేర్మితోన్. ౨౪

కం. చినలక్ష్మినాంచారమ
యను చెలువను పెండ్లియాడి, హాయనను గులుకన్
గనునాపెయందు నలుగురిఁ
గనియెఁ గొమాళ్ళను కొలంత ♦ కడఁగనువారిన్ ౨౫

కం. సింగరదేసికు డనఁగను
రంగాచార్యుండనంగ, రాణ నృసింహా
ర్యుంగడు రామాచార్యుఁడ
నంగను దశరథుని బోల్కి, నల్వుర గనియెన్. ౨౬

సీ. తొలుత సింగర దేసి ♦ కులపేరు పెంపొంది
కబ్బములంజలి ♦ నిబ్బటీకము

దెలుపుచు మక్కువ ♦ గలుఁగఁగ నెనిమిది
యక్కరాలను గల ♦ దంతయెల్ల
ప్రజలకుఁ దెలియంగఁ ♦ బలికి మఱ్ఱికిఁ ద్రోవ
గానుపింపఁగఁ జేయు ♦ కలికియతఁడు
రెండవ కొమరుండు ♦ కండిరాయలతోడి
చెలిమిఁ బెద్దగఁ జేసి ♦ చెప్పి తెలివి

గీ. మల్లమన్నెంబులెల్లను ♦ మంచిగలుఁగ
పలుకులవలంతితనమున ♦ వచ్చిబోవు
పెద్దలకు మన్ననలజేసి ♦ పేర్మి యలర
బువ్వ తేగంబు గావించి ♦ పొలుపుగాంచె. ౧౪

గీ. నాలుగవ కొడుకు రామరాఖ్య ♦ కొలగమున
వీనె మీటుచు పాటల ♦ వీనులలర
జేసి రాజుల మెప్పించి ♦ బేసి కనుల
చెల్మికానినిమించె ప ♦ సిఁడినిఁ దెచ్చి. ౧౫

సీ. మూఁడవ కొమరుండు ♦ ముత్తి చేడియదారి
దెలిపెడు పెద్దల ♦ తేజుఁగాంచి
బ్రామినుకులలోన ♦ బబలిన మసగులు
బయలుబెట్టిన యట్టి ♦ బల్లిదుండు
వేల్పుబాసను నాల్గు ♦ విద్దెలయందును
పేరు కెక్కిననేల ♦ వేల్పు పెద్ద
వలనుగా జేదువులు ♦ వలసిన వారికి
నరలేక నేర్పిన ♦ యట్టి ప్రోడ

గీ. రచ్చలను పెంపువడయుచు ♦ రాణ (జెంది)
రొక్కమునుఁగూర్చి దెసలను ♦ బెక్కుయసము

కలయఁ జెలువంబుఁ బొంపొందె ♦ వలువిరిదుల
వేఁపుతోఁ సుగంబు ♦ల వెలసె మఱియు. ౨౯

సీ. ఎవ్వానియునుము మి ♦ న్నేటికి సరిమించి
కఱకంతునికి మచ్చఁ ♦ గలుగఁ జేయు
నేవాని యీవిమ్మ ♦ బ్బైపారగబి కాసి
వానకోయిలతోఁగ ♦ వరలుచుండు
యేవాని విద్దె నె ♦ క్కొర్పడగా మేటి
బాబులమునినట్టు ♦ బాపుచుండు
నేవాని సైరణ ♦ లెన్న పల్విత్తముల
పాలికాపుల మరి ♦ బంచెనూన్చు

గీ. నట్టి చదురుని నేరుపు ♦ లారడంబు
నీటుకీరితి యోరుపు ♦ నిబ్బరంబు
లలర రంయూల కొలముక ♦ డలికి చలువ
రాయఁడనఁగ నృసింహాహ్వ ♦ డాయితవడి. ౩౦

సీ. గోవిందనగరిఁ నా ♦ కొట్టికలోఁ గొప్ప
కోవెలఁగట్టి ని ♦ గ్గులుఁ జెలంగ
సీతను రాముల ♦ చెంత లక్ష్మణ వేల్పు
నిలిపి వారికిముందు ♦ నేర్పుఁ గలుఁగ
కట్టుఁగ పదియూరు ♦ కంబాలచవికెను
గట్టించి నెలకు ప ♦ క్కమున కేట
వేడుకలెన్నొఁ గా ♦ వించుచు బెండిలి
తిరుణాళ్ళ సలుపుచు ♦ పెనవిలాతి

గీ. వలన నేతెంచు పెద్దల ♦ వావుడకున్మ
నేయుచును బువ్వ నొసఁగుచు ♦ నేమమునసి

తేగముల నెన్నియోఁ జేసి ♦ తిరఁము గలుగ
నన్నిట వలంతియై తిరి ♦ గెన్నదగుఁగ. ౩౧

కం. దుదుసులుఁ బలుకనిదై పె
న్నెరుసులు కలనైనఁ గాన ♦ ని కఱకఁగలదా
నరుసమయను కన్నెను ము
న్నరుసంబున చెట్టబట్టి ♦ యలరె కలిమిగన్. ౩౨

గీ. కడలికూతురు కఱివేల్పు ♦ కై మెలంగు
కరణి క్రొత్తడియగు నాపె ♦ కలసి మెలసి
బత్తి నేయుచునుండ న ♦ బ్బుర మెలర్ప
కనియె నిద్దఱు కొమరుల ♦ కలికియందు. ౩౩

గీ. కన్నకాన్పున పెద్ద సిం ♦ గరగురుండు
నాఁజెలంగి వలంతియై ♦ నాయకుఁగను
తండ్రి నిలిపిన జెజెకుఁ ♦ దగిన కొలఁది
వక్కమున నెల యేడాది ♦ వఱకుఁ జరుగు
మేలు తిరునాళ్ళఁ జరుపుచు మేటియయ్యె. ౩౪

ఉ. దక్కినవుం విలాతిగల ♦ తామరపాక్కిలి తానకంబులన్
మిక్కిలి గాసి రంగమున ♦ మిన్నగ మార్గళిలోని వేడుకల్
చక్కఁగఁ జూచి రాగవుల ♦ చక్కని కోవెలలోని వందిరిన్
రక్కొనగోదనోము లల ♦ రం దిరునాళ్ళను జర్పెమక్కువన్. ౩౫

ఉ. వచ్చెడు పెద్దలందఱకు ♦ వంటకముంగుడిపింపఁజేసి తా
హెచ్చిన బత్తితోఁగొలది ♦ యింపుగ సీతమనాబడంతినిన్
చెచ్చెరగేస్తుబాడికిని ♦ చేకొని సింగనపేర నొక్కనిన్
లచ్చి కొమారునట్లఁగని ♦ లక్కిమినాయని బత్తుఁడైమనెన్. ౩౬

సీ. రెండవకొడుకు మేల్ ♦ రేకలు గలిగియు
రంగార్యుఁడనగను ♦ రాణకెక్కి

తనయన్న యట్టులఁ ♦ దామరపాకిల్లి
బత్తుడై యన్న ని ♦ బ్బరికమునకు
తగినవాడై చాల ♦ దాపరించినకల్మి
పెద్దలకిడుచును ♦ నిద్దమైన
తొలుతటి కోవెల ♦ కలరారఁ దాపట
గుడిగట్టి యందులోఁ ♦ గోదనిల్పి

గీ. యూరిలో కల్మిగలవారి ♦ కొడబడికను
సిరులఁ జేకొని తిరుణాళ్ళ ♦ కరయువలయు
పలువితంబుల పనిముట్లు ♦ వార్వమనుమ
దరదమును గరుడిమొదలుఁగఁ ♦ గలుగఁజేసె ౩౭

సీ. పితరులు తనిసన ♦ ప్రేముడిగాగేస్తు
బాడిని మన్నించి ♦ పాండునివలె
వేడుకరంగమ ♦ వేంకటమ యనెడి
యతివెలు ని ♦ రువు రిల్లాండ్రుగాఁగ
గైకొనఁ పెద్దాపె ♦ కడుపున నైదుగు
రుప్పతిల్లిరి కొడుకు ♦ లొప్పఁ గలుఁగ
ముద్దులుఁగా విద్దె ♦ లొద్దికఁగా నేర్చి
కడువెల్గిరొగిని వెం ♦ కటనృసింహులు

గీ. డనఁగ సింగరదేసికుం ♦ డన చదురు జ
గముజగన్నాథుడని బిల్వ ♦ గణుతి సీత
రాముడనగను వెండి శ్రీ ♦ రంగఁడనఁగ
పాండవులవలె మంచిలో ♦ పాటుబడిరి. ౩౮

సీ. పుటి వెంకటమపేరి ♦ మగువ చిన్నమయందు
గలిగిరి కొమరులు కలుములలర

దమ్మిలకలువలఁ ♦ దలయెత్తగాసేయు
దొరలయట్టుల వేడ్క ♦ తుల్లఁదూఁగ
ఘలఁగిరి లక్ష్మన్న ♦ సింహార్య కృష్ణార్య
లను పేరుతో జంట ♦ నునుపుగలిగి
పై వారు వీరు నె ♦ ప్పరులైరియాసత
కొమరులలో పెద్ద ♦ కొమరుఁడనఁగ

గీ. లంతఁదీరఁగ తండ్రి యు ♦ ల్లమున కెలమిఁ
గలుఁగఁదిరుఁగుచు బుడుత చె ♦ య్యూలదొలంగ
నతము పెద్దలదాపున ♦ సంతసంబు
సంపతిల్లఁగ తెల్పివిలె ♦ స్సయని తెలిసి. ౩౯

గీ. కైతఁగలిగినబ్రాఁతి ల ♦ క్కనముఁదెలిసి
కబ్బములుకొన్నిఁజేసి యా ♦ కారునందు
నచ్చతెనుఁగున నొక కత ♦ విచ్చలవిడి
జెప్పఁగా బుద్ధితామరఁ ♦ జేర్చియుంటి. ౪౦

ఉ. నేనొకనాటి వేకువను ♦ నిద్దురలేచి గురుందలంచి చె
ల్వూనఁగ తానమాడి లలి ♦ యొప్పఁగ వేబది రెండుచోటులన్
దానగగీఱు, నామము లొ ♦ యారముగానిడి కన్నయన్నొసల్
బూసిక కారికేశవుల ♦ బుట్టువులే మణవాళజోగి మేల్. ౪౧

కం. ఏకతమున మంతరముల
జోకనుఁగొని మూడిమూడి ♦ జుట్టునకలఁతల్
బోకార్చిబత్తి పెనఁగొన
నాకొమరులు తములు నేను ♦ నాతలిదండ్రుల్. ౪౨

గీ. కలసి గోవిందనగరిలోఁ ♦ గలుఁగుగుడిని
గోదనోచిన పూటల ♦ లోఁ దలంప

మేటిముక్కోటి తిరునాళ్ళ ♦ నాటనుపేరు
మాళ్ళుచవికెకు విచ్చేయు ♦ మాపుతుపను. ౪౩

సీ. కొందరు తిరుమడుల్ ♦ గొడుగులజంటయు
రాణించు వింజామ ♦ రాలువీవ
వీణియపాటల ♦ వివరించిదాసగుల్
కుత్తికలెత్తి ప్రమొ ♦ క్కుచునుబాడ
వెనుకను ముందర ♦ విరివిగా సారమెత్తి
బ్రాహ్మిన్కులఅవముల్ ♦ బావలాడ
వేలకొలంది ది ♦ వ్వెలుబట్టి యిరుదట్టు
సాదులుబొగడ విచ్చలవిడిగను

గీ. తళుకువలమురిగుడునువాల్ ♦ దలలవెలుఁగు
దుద్దుకట్టులచేబూని ♦ తొలుఁగుఁడని బ
రాబరులుసల్పి సాతాని ♦ రాయలుండ
సిరులుఁజెలువార సామివేం ♦ చేసెనంత. ౪౪

గీ. ఇంతయని చెప్పరాక న ♦ న్నెలుతండ్రి
కనులపండుగాగన ♦ గంగికల్మి
మీరచవికను రతనాల ♦ మేల్మిపీట
పైననిలిపిన తరువాతి ♦ బత్తిఁగలిగి ౪౫

గీ. కేలుఁదుగనొక్క చోఁజేర్చి ♦ కేరినిల్చి
యున్నతఱి నేనుబోవుట ♦ కన్న మొదలు
నున్నపెద్దలు కొందఱు ♦ చిన్నినుడుల
మన్ననలఁజేసి రమ్మన ♦ మరుపుపడక. ౪౬

వ. నట్లు వారి యానకు సంతసము మన్మతిల్ల నేల సంటుసట్లొడలిం
జేర్చి కేల్ జంటచాచిపడి లేవకున్న పెద్ద లంగటిలో లక్ష్మణా
రుసికిన్మూటు రూపుగల మరింగంటి లక్ష్మణదేసికుం డక్కటికము

బూని కేలు వమ్మ్రలం గీలించి లేవనెత్తి తమ దాపున గూరు చుండ సన్నజేసిన వారి యిచ్చ నొడగూడునట్లు నడచినంత కొంతవడికి యా రచ్చను గలవాఱంద రాలించి వినుచుండ నమ్మాళ్వారు సాదించిన తిరువాయ మొద్రిలో రాములను బాడిన (కర్వారి రామబిరాన్నై) యనుపాశురంబుం జదివి దానఁగల మరుఁగు విప్పి చెప్పుచు నడుమ కన్నయ్య కుబ్జకుంజేసిన మెలుతార్కణ గావించినవక్కణంబు నా పెదతండ్రి యగు సింగరాచార్యుం డాలించుచు కబ్బమందుఁగల యిచ్చలలమికొన. ౪౭

ఉ. హెచ్చినకూర్మి నాదరికి ♦ హెచ్చరికన్మిగులంగవచ్చి తా
జెచ్చెరనుండికీరతికిఁ ♦ జెల్వగుపల్కుల కొంతప్రొద్దుబో
బుచ్చికొమాళ్లు బందుగులు ♦ పొందులు తమ్ములు పెద్దలున్వినన్
మచ్చికమీర తియ్యనగు ♦ మాటలవేవిన బల్కెవేడుకన్. ౪౮

ఆ. బావిచెరువుతోట ♦ బావనికివడుగు
కైతకోవెలయును ♦ కాసులెలమి
బాతిపెట్టుటయును ♦ బాడియైయులరారు
నతవితముఁలఁ గలఁగి ♦ సంతులహాహా ౪౯

ఆ. బాడియలరనిల్పు ♦ ప్రాఁతియా సంతులు
సతమునుండుటకును ♦ చాలకూడు
కబ్బమట్లుఁగాక ♦ కారులెన్నో యుండి
వరలఁజేయు నతని ♦ వంగడంబు ౫౦

క. సరిమునుఁజేసిన కలుచము
తరతరముల పితరులెల్ల ♦ దప్పకపునెముం
దొరకొనెదరంచు పెద్దలు
విరివిగ వాకొసరికైత ♦ వివరించినచోన్ ౫౧

వ. కావునసీవు పొచ్చెంబులేని మచ్చికతో నచ్చతెనుఁగున కుబ్జాకృష్ణ
విలాసంబను పేరట నొక్కకబ్బంబు కొలఁపుదేవరయగు వేలుపు
గొండలచ్చిమి నరసింగని పేర యంకితముఁ జేయుమని మక్కువ చెక్కు
లొత్తి నక్కటికవేల్పు నొడ్డోలగంబున్నతఱి వక్కాణించిన నరియని
కొలువు పెద్దలుఁబలికిన వల్లెయని యుల్లంబున సంతసంబు వెల్లిఁగొన
నల్ల దేవరకు నీ కబ్బంబు నొప్పింపంబూని. ౧౨

(షష్ఠ్యంతములు)

క. సిరిచన్నొట్టులఁగల క
స్తురికప్రపుటనటి చిన్నె ♦ తులకింపగ వ
య్యారమే పరిరాయనివిరి
పరియఁకముపైన నతనిం ♦ బం[illegible]న్. ౧౩

క. నలమేని దొరకుపల్లొ
మ్ముల మొకముల మేటి గొడనబో ♦ కడచిన వే
ల్పుల రాయనూనికమునకు
కలువల చెలిదెగడు మొగముఁ ♦ గల దేవరకున్. ౧౪

క. దిట్టరికి పాలకడలిన్
బుట్టువుమగనికిని లచ్చి ♦ పుణ్నెంబులకున్
నట్టువఁగలిగిన వానికి
దట్టపుగొలచీకువాలు తామరచెలికిన్. ౧౫

క. మగటిమి కంబమునసిలిచి
జగజెట్టన కనకకసిపుఁ ♦ జంపిబుడుతసిన్
డగఁజదలు కావురుసులె
న్నగఁబ్రోచిన వేల్పుగొండ ♦ నరసింగనికిన్. ౧౬

క. అప్పనముఁజేసినా నే
ర్పుప్పతిలంగుబ్జయనెడు ♦ యుగ్మలికతన్

టొప్పఁగ నచ్చతెనుఁగున
జెప్పెదసింగారమెల్లఁ ♦ జిప్పిలఁగన్. ౫౭

క. మున్ను పరీక్షిత్తను దొర
వెన్నని లలిగొనము లనెడి ♦ వేల్పులబువ్వన్
బన్నుఁగవీనులఁ గ్రోలుచుఁ
గన్నన శుకుఁడనెడు జోగి ♦ రాయని కనియెన్. ౫౮

క. కన్నయ్య మంచికతలె
న్నెన్నియొ వినియుంటిఁగాని ♦ యిఁకఁకుబ్జయునన్
వన్నెఁగల వలఁతి కూడిన
పున్నెపుఁ గతవితముఁ దెల్పు ♦ మోయన యనియెన్ ౫౯

(పు ర వ ర్ణ న)

గీ. ముగిలినిచ్చెడు వీఁడులు ♦ మూఁడునాలు
గందుకన్నాకు విచుప్రోలు ♦ చందములను
మించి సిరికాటపట్టయి ♦ మిన్నుప్రాయు
మాలెలుఁజెలంగి మధురనా ♦ ప్రోలు వెలయు. ౬౦

క. ఆప్రోలు కోటకొమ్మలు
చూపరులకుఁ గానబడక ♦ చుక్కల తెఱువున్
రాపిడిసేయుచు పైదా
దాపునఁ జదలేటి తమ్మిదాటులు డాసెన్. ౬౧

సీ. బంగారుగోడల ♦ బొంగారుమేడలు
రంగులెసఁగి హరా ♦ రంగుజూప,
రవళింపుగుచ్చులు ♦ రతనంపురచ్చలు
నిచ్చలోమచ్చిక ♦ హెచ్చుఁగూర్ప
మిన్నుదన్నెడువెన్ను ♦ వన్నెతిన్నెలచెన్ను
లరుదుగాఁజూపరు ♦ లలరసేయ

పొలుపగుకోటలు ♦ పొందైనతోటలు
మినుపిసు నెల్లత ♦ చ్చనములాడ

గీ. ముత్తియంబులచేరుల ♦ హొత్తుచూరు
లలరఁగస్తురిఁజల్లిన ♦ యంగణులును
కలువతామరకెందొఁగల్ ♦ గలుగుచెఱువు
లాటపట్టగులకిమి కా ♦ వీటియందు. ౬౨

గీ. మచ్చకంటుల మేకల ♦ మచ్చికలర
లలిఁగఁగూర్చున్నతఱి మక్క ♦ వలుఁదలిర్ప
నచ్చరలఁగూడివీణియ ♦ లందుకోర్కి
తీరవాయించుచుందురుఁ ♦ గారవమున. ౬౩

చ. నలనగువేల్పురాయరత ♦ నంబులు తిన్నెలమీఁద రాచక
న్నెలు దెలిముత్తియంబులను ♦ నీటుఁగ ముగ్గులుబెట్టి ముగ్గులున్
గలఁ దమనీడఁజూచి యలు ♦ కందుల కన్నెలటంచుదన్న ము
గ్గులుఁజెడఁదెల్పనవ్వులను ♦ కూఁతులఁగాంచియు నవ్వుచుందురా. ౬౪

గీ. నెలకలుల దాపుగోడల ♦ నెలవెలుగుల
జేవితేరులకలులనీ ♦ డానఁజూచి
రింగుబిళ్ళలటంచును ♦ బొంగికలుల
బోరొనర్తురు తెమ్మని ♦ బుడుతలచట. ౬౫

సీ. పాఱులు చెలికాండ్రు ♦ పసలారుమద్దెండ్లు
వాయించుండెడి ♦ వన్నెకాండ్రు
గాణకత్తెలగోండ్లు ♦ కమ్మనఁగలపండ్లు
పొల్పగుజవరాండ్రు ♦ బొజుగుకాండ్రు
యలరులబొదరిండ్లు ♦ కొలఁకుఁ దామరతూండ్లు
మెక్కనంచలపిండ్లు ♦ మేల్మిదిండ్లు

కటికపుపాలిండ్లు ♦ గలిగినవిరిబోండ్లు
సొగసైనవాకిండ్లు ♦ సోర్నగండ్లు

గీ. పోడిమింగలకమ్మని ♦ పూలచెండ్లు
పలుకులలరఁగ కొణిగల ♦ బట్టికాండ్లు
బిడ్డలల్లుండ్రుబంగరు ♦ పెంకుటిండ్లు
కొడుకుకోడండ్లు బబలిన ♦ గునుపుచేండ్లు ౬౬

ఉ. పచ్చలకంబముల్ పసిఁడి ♦ బన్నిన గుంబములొప్పు నంగడుల్
రచ్చలకొత్తడంబులును ♦ రానగరుల్ రతనంపుమాళిగల్
మచ్చులపావటీలువిసు ♦ మానములో హాయుమంజిముత్తెముల్
గ్రుచ్చినచూరులొప్పుకల ♦ కుల్కొలకుల్ వెలుఁగొందువింతగన్. ౬౭

ఆ. తొల్లికుండబాము ♦ దోసిటిలోనేల
బిడ్డమగఁడుకోల ♦ బీచ్చుతత్తిని
యెవరుఁబ్రోవకునికి ♦ నేటిపాడివ్వేడు
జేరెనన నగడ్త ♦ చెన్నుమీరె. ౬౮

ఉ. పచ్చలకుందనంపుఁపని ♦ పన్నినమేడల నెచ్చెలుబ్బుకుల్
విచ్చియుచేమ యూర్పనట ♦ వేసినసోరన గండ్లవెంబడిన్
వచ్చినకప్రపున్ బొగల ♦ వన్నెలమబ్బు లటంచునెమ్మికల్
మచ్చికచిందుద్రొక్కుచును ♦ మాటికిమాటికి విచ్చుపించెముల్. ౬౯

ఉ. వెన్నెలగుత్తికల్లులను ♦ వేల్పులమన్ని మానికంబులె
న్నెన్నియొ దాపికొప్పురము ♦ లెత్తుగ వేల్పుల దారినంటగా
బన్నిన దద్దళంబులను ♦ వాలెముజోతులు కప్రపుఁబొగల్
వన్నెగఁ బర్వవేలుపుల ♦ బావలుబూజలు సేతురెప్పుడున్. ౭౦

క. వన్నెఁగల వీటనేనుఁగు
గున్నలలరు నెనిమిదివలఁ ♦ కులనేనుఁగులున్

మన్నుదలమ్రోయు ననిమది
నెన్నుచు తలలూఁపితిరిగి ♦ హెచ్చరికలతోన్. ౨౧

తే. గీ. లగ్గులక్కనముల ♦ లలియూపులావును
గలిఁగిజింకరౌతు ♦ కత్తళమును
మూలనుండసేయ ♦ జాలినప్రోలిర
వాల్నడల్ జెలంగు ♦ వారువములు. ౨౨

ఆ. వె. పసిఁడికొండబోలి ♦ పగటువేల్పులజేని
బేసికంటిపొందు ♦ బెళుకులొదవు
నరదములనుమించి ♦ యందగించెనుచాల
తేరులరయవీటఁ ♦ దెప్పలుగను. ౨౩

ఉ. ఒక్కటి రెండుపల్లియల ♦ నుబ్బణగించుచు ముజ్జగంబుతో
నెక్కుడు కీరితింగనిన ♦ యేనుఁగు రక్కసితోలుఁ దాల్పదిన్
లెక్కలుఁబెట్టకేఁ గడిఁది ♦ లేఁకలునవ్వుచు నీసడించి పే
రుక్కుచలంబు మచ్చరము ♦ లొప్పగనుందురు ప్రోలిలోపలన్. ౨౪

ఉ. పేరిమితో మొగంబొకట ♦ విద్దెలనన్నిటి నేర్చిదిట్టలై
వారకనాల్గుమోములరు ♦ వాణిపు మిన్కులనేర్చియడ్డ పా
టోరగిలెన్ గదాయనుచు ♦ నుడ్డమొగంబులవేల్పు మెచ్చఁగ
య్యూరను ద్రిమ్మరిల్లుదురు ♦ నొప్పుగ నెప్పుడు నేలవేలుపుల్. ౨౫

ఉ. ముప్వురువేల్పు లొక్కమొగి ♦ బోరన ముంగలనిల్చియుద్దడిన్
జివ్వనుమార్కొనన్ గడఁగి ♦ నీదలునొందకఁ గెల్వజాలియున్
గ్రొవ్వఁజెలంగబాపలకు ♦ కోరినకోరికలిచ్చి వీటిలో
మవ్వఁగనుంద్రుతమ్మిచెలి ♦ మామకొలంబుల రాచబెబ్బులున్. ౨౬

ఉ. లెక్కలుఁగల్గియున్న తన ♦ లిబ్బులఁగన్గొని నిక్కుచున్నయా
జక్కులరేనిబింక మెక ♦ సక్కెముచేయుచు వీసుబంతిలో

మక్కువసోములక్కుమియు ♦ మన్ననసైరణ మమ్మరించగన్
దక్కిరికోమటుల్మిగులఁ ♦ దామరదంపరలయ్యు నిచ్చలున్. ౨౨

ఉ. కౌనున తెల్లదువ్వలువఁ ♦ గట్టక నెప్పుడు వెఱ్ఱిసీళ్లకై
పూనికఁ జేసినాగలిని ♦ పొల్పుగ వెన్నునఁ దాల్చిదున్నకే
నేనొకమేటినంచుమది ♦ నిక్కుచునుండెడు నొంటిప్రోగురా
నానగుబాటుసేయుదురు ♦ నాలవవారి కొలంబులెచ్చుగన్. ౨౩

సీ. చేదమ్మికోసరుచు ♦ చెలువచేరితియిమ్మ
చేదమ్మియిచ్చిన ♦ చెల్వదేమి
చనుబంతులిచ్చిన చనెదన్న ♦ చనుబంతు
లెలమిఁగోరుటకంటె ♦ కలువఁగోరు
కలువఁగోరిననీవు ♦ విలువఁ జూపవుగదా
విలువఁదప్పించిన ♦ విరివియేమి
మగువకెమ్మోవిమ్మ ♦ మాటిమాటికినన్న
మోవినిచ్చెదగాని ♦ మొదలనీవు

ఆ. వె. మొగలదెలియుమన్న ♦ మొగలనుదెలియఁగా
వెంతయానటంచు ♦ వింతలొప్ప
కుమ్మనుద్దులాడు ♦ చిమ్మియునవ్వీట
పువ్వులమ్మచుంద్రు ♦ పువ్వుబోండ్లు. ౨౪

ఉ. చయ్యన మేల్కడాని పని ♦ సాగిన చందురురాల మేడలో
తొయ్యలులెల్ల చన్నులను ♦ దోగిన కప్పురమున్ జవాదులన్
బయ్యెదఁజాఱుతూటి విరి ♦ బంతుల కమ్మన మోచిరొయ్యనన్
నెయ్యముమీఱబట్టమున ♦ నీటుగఁద్రిమ్మరుకూన గాడుపుల్. ౨౫

ఉ. నెమ్మికనివ్వటిల్లఁగను ♦ నిద్దపుబంగరు తూగులాలులన్
బమ్మినతల్గడల్ నునుపు ♦ పాన్పుల సంపెఁగిమల్లి మొల్లలన్

కమ్మదనంబుగాఁబరచి ♦ గాణియలెప్పుడు కోడెకాండ్రతో
యమ్మలగుర్తుచేయుదురు ♦ హాసగుపాటల వీనెమీటుచున్. ౧౧

ఆ. వె. వీటిబోఁటులెల్ల ♦ వెలయాండ్రవేనలి
కనులచనులఁగాంచి ♦ కాంచివలచి
వారి బొమ్మసన్న ♦ వలయు వానినిఁదెచ్చి
యిచ్చికలయుచుందు ♦ రిచ్చఁగలుగ　　౧౨

సీ. పల్కులుదాళిమ్మ ♦ పాలిండ్లుగజనిమ్మ
మైతావిపూరెమ్మ ♦ మప్పితముగ
చిగురులడ్గులనిక్కు ♦ జిలుఁగుగచ్చులముక్కు
తమ్మిమోమునఁజిక్కు ♦ దాపగుక్కు
తొడలనంటునగేవు ♦ నుడులుచిల్కలతీరు
యొడలుకాంచనసౌరు ♦ లొప్పుమీర
సారముకోగిలమించు ♦ చూపులేళ్లనువంచు
కురులుచీకటిమ్రానుఁ ♦ గొనబుద్రెంచు

తే. గీ. మోవిమోవికిపాటియై ♦ బోలెకొదమ
తేంట్లకన్నావసురపొన్న ♦ తీరుపాకి
లలరజవ్వనముంగల ♦ యతివలవలె
యాటఁదోటలునవ్వీట ♦ యలరుచుండు.　　౧౩

(రా జ వ ర్ణ న)

క. అప్పట్నం బొడికారం
బొప్పంగను నుగ్రసేను ♦ డొనరఁగ నేలున్
నెప్పరిగదచ్చి కడలన్
జిప్పిరిలిన నోగియసంబు ♦ సిరులుజెలంగన్.　　౧౪

ఉ. చన్నులఁగక్క సంబుపరు ♦ సంబుల కోరుల నొక్కవాతెఱన్
కన్నులజంకువే నలిని ♦ కౌడునుపెన్నడలందు జాగులన్

బన్నము దాయలన్నుడులు ♦ బాటిలు పొక్కిలిలేమి కౌనునన్
బన్నుగ బంచిపెట్టుచును ♦ పట్నముఁ బ్రోచెను రాయఁడెప్పుడున్.

సీ. తనలోతుగొనమున ♦ కును పాలకున్నిరు
కదలక నొకచోట ♦ నొదిగియుండ
తననేలఁ దాల్చుట ♦ కును దచ్చికడలగా
రులఁ దలలలుకనై ♦ మెలఁగుచుండ
తనయీ విజలకంబు ♦ లును బలపేఱునై
మిన్నేటితోడను ♦ మేలమాడ
తనయసం బుట్టిప ♦ డిన వెండికొండపై
పసగల ముక్కంటి ♦ బలుచబరుప

గీ. పైడిచూలాలు తేడులె ♦ వ్వటికి వెంబ
డించి కొలువఁగ పాడియై ♦ మించిగొనము
లలరుచుండఁగ పజలనె ♦ ల్లపుడు బ్రోచి
వెలయునవ్విటిలో రాచ ♦ వేల్పు తేసు. ౮౬

క. ఆరాయునిచే ♦ దాయులు
పోరునఁ దెగటాఱివేల్పు ♦ బోగము చెలులఁ
గారవమునఁ ♦ గూడుచునా
రారాయుని కొసరుచుంద్రు ♦ హారుసమెలర్పన్. ౮౭

ఆ. పిఱికితనము కొలము ♦ కొఱ కొఱయీలేని
గొనము తుఱుగుకల్ల ♦ లునుబిగియును
కఱువు గొడ్డువారు ♦ కలనైన బొంకులు
లేకరాయఁడేలె ♦ జోకమీర. ౮౮

సీ. పగ్గెగొనంబులు పరిఢవిల్లఁగ వేల్పు
టొజ్జజన్నపుదిండ్ల ♦ పజ్జఁజేరె

చక్కఁదనాలకు ♦ చక్కెఁరవిల్తుండు
మేయిని విడనాడి ♦ మెలఁగనేల
మగటిమి కెడబీకు ♦ మమ్మరించగనోడి
సింగపు కదుపులు ♦ చేరె దొనల
మొగము చెల్వమునకు ♦ తొగలరాయుం డోడి
కోడెకాతునుఁ జేరెఁ ♦ గొల్చుచుండె

గీ. ననఁగనేరుపు సైరణ ♦ లారడంబు
లరుసమును గట్టితన ముక్కు ♦ నక్కటికయు
గలిఁగిమోట ముకెగడుచు ♦ కలఁతవిడచి
పబలె వీటనురహిమీఱ ♦ పాడుసాహి  ౭౯

సీ. పసఁగల మిన్నేటి ♦ పాలసంద్రంబున
మేలుమేలని చాల ♦ నోలలాడి
మల్లెలమొల్లలమఱి ♦ తెలిముత్తియం
బుల పేరులక్కన ♦ పెలుచదాల్చి
తెలిదీవివెండి కొం ♦ డలకేగి మగరాల
నెలరాల దిన్నెల ♦ నీటుఁజూచి
యలరారు పండువెన్నెల ♦ బాజుదెగడుచు
తెలిదామరల ♦ తెగద్రిమ్మరిల్లి

గీ. నలువచెలువ కలువతేని ♦ వలపుతేని
నూడులకు కొప్పునెద నట్టు ♦ జూపి వెలిఁగి
కీరితనిమెను వెలఁదుక ♦ కేరుచుండి
వచ్చి యీరాచచందురు ♦ పజ్జఁ జేరె.  ౮౦

ఉ. మొదలిటిదాసరయ్య తొలి ♦ ముట్టి మొకంబును కొండలేమనె
న్నిదికడలేనుఁగుల్ చిలువ ♦ మేటి మొదల్కొని మూఁడుజెత్రులొ

ముదుకలు జేరి బ్రోచిరని ♦ పొందికగా నడిబెట్టి నొక్కచే
నదటుగ నేలదాల్చి కల ♦ యంగనువారలఁ బన్పుఁదీరఁగన్ ౬౧

గీ. కడలఁగల రాచమూకల ♦ తలలవెలుఁగు
పసిఁడి బొమిడికముల రవ ♦ లెసగు బాజు
లలరజోహారు సేయఁగ ♦ తొలకుహజ్జ
తామరలుగల్గి దొరసుర ♦ తాణి వెలుఁగు. ౬౨

క. తెఱవాటు కాండ్రు పిరడి
పిఱికియు గొండీడు తులువ ♦ పేదయు మొగలా
కఱటివజలే కరాయం
డఱి ముఱిగాపీడు బ్రోచె ♦ నబ్బురమెసఁగన్. ౬౩

సీ. ఆరావు తనరాణి ♦ తో రాణనుండఁగ
గొడుకులు తొమ్మండ్రు ♦ గురు గలిగిరి
అరయఁగ కంసు ♦ డన్య క్రోధుడనునాము
కుండుకవాహ్వండు శం ♦ కుండునుభువు
డనరాష్ట్రపాలుడు ♦ ననవిసృష్టుండన
తుష్టిమంతుండన ♦ తుల్లఁదూగి
కంసయనంగను ♦ కంసవతియనంగ
రాభువననగను ♦ రాష్ట్రపాలి

గీ. కయనకూఁతులు నలుగురు ♦ గలిగి మిగుల
కలుములలరార సంగడీ ♦ కాండ్రు బందు
గులును బిరుదులు మంతిరి ♦ కొలముఁ గొలుప
వీటబబలెనురా రాచ ♦ వేల్పుతేడు ౬౪

గీ. ఆవుడమితేని కెప్పుడో ♦ య్యారమెసఁగ
కప్రపుముకవాది కస్తురి ♦ గందములను

దెచ్చియిచ్చెడు బాలిక ♦ నచ్చకంటి
కమలియనఁ బ్రోలఁ జెలువందె ♦ గారవమున. ౯౫

వ. అంత నక్కలికి చొక్కమగు చక్కఁదనంబుల నుక్కుమిగిలి నక్క-
జంబగు కలిమిచే బుత్తిసి సొక్కుచు నొక్కనాఁడు మంతనంబున
హాయిమీఱ జేడుం దానుపడక గదిం బిరిసెజ్జం బవండి తెలివి
యుప్పతిలఁ దనడెందంబున నంతులేని కొఱంతగల కలంత బలవం
తంబైనఁ దనమగనిం జూచి సొగసులాడి యిట్లనియె. ౯౬

చ. పితరులు నెల్లఁ దన్విసన ♦ ప్రేముడిఁ గొందురు నాల్గుదిక్కులన్
సతిమయసంబుఁ బిక్కటిలు చాల్మనవంగడ ముందుబుట్టుపు
ల్జతనపు గొప్పఁగాంచెదము సంతుఁ జెలంగిన సంతసంబుఁగా
నఁ దమినిబిడ్డలం గనిన నాఁకొలమంతట మేలుఁగల్గదే. ౯౭

గీ. బిడ్డలేనట్టివారలు ♦ బెట్టుకూడు
గుడువఁదగదని రుసులెల్ల ♦ నుడివివారి
వారివక్కణమంతయు ♦ వరుసఁ దెల్పి
మెసవుదురు నీరువంటక ♦ మనలుఁ గలుఁగ. ౯౮

ఉ. తమ్ములులేని కేళకుళి ♦ తావులులేని కడింది పూలు కెం
దమ్ములదాయలేని నిసి ♦ తప్పక దిబ్బములేని యిల్లు ద
య్యమ్ములులేని దద్దళము ♦ హాయిగరాయఁడులేని రచ్చవా
యమ్మగు నట్లు సంతువహా ♦ హా మొలతెంచని బాముపమ్మగున్. ౯౯

ఆ. సంతులేని వాని ♦ చాలుదలంచిన
బ్రతికినంతవరకుఁ ♦ బబలుసుగము
కల్మియున్ననేమి ♦ కానరెప్పుడు ముత్తి
యిండ్లకెల్ల సొమ్ము ♦ లేకొడుకులు. ౧౦౦

వ. కావున మనపుట్టుగుగిట్టుట వట్టిదియొకాని మంచిగానేరదు నా డెం
దంబునం గల తలంపొడఁ గూడుటకై యడవి కేగి బత్తులమై

పొక్కిలిచూలి ముక్కంటి మొదలగు చక్కటివేల్పుల కెక్కుడు
దేవరయగు రక్కసిగొంగ పాజ్జదమ్ముల మక్కువచే తలంచి
మిక్కిలి మ్రొక్కులు మ్రొక్కి కోర్కె లొడఁగూర్పుకొనెదమని
నాలు మగలు తమయిల్లు నూడిగపుచెలియల కంకియఁ జేసి. ౧౦౧

ఆ. పులిసివంగి దువ్వి ♦ బొబ్బమెకంబును
కడఁలియొంటి కాడు ♦ కటికమెకము
పుట్టకూడుతిండి ♦ పొడలమెకంబుల
బారుఁదిరుఁగు లొంకఁ ♦ జేరనరగి. ౧౦౨

క. కట్టెదురంగనుఁ గొనెపూఁ
జెట్టులుఁ బొదరిండ్లుఁ బలుకు ♦ చిలుకలగమియున్
నట్టువపులుఁగులుఁ దిరిగెడు
పట్టగునొక తపసితోటఁ ♦ బడఁతియుఁ దానున్ ౧౦౩

సీ. ఎలికఁపిల్లలఁ బిల్లి ♦ తెలమితో నాడించు
వాలుగలను కొంగ ♦ వరుసగాచు
పాలుపొందఁ గువ్వలఁ ♦ బ్రోచు డేగకొలంబు
సింగంబు లేనుఁగుల్ ♦ చెలిమి సేయు
కాటెను బోతులు ♦ కత్తళంబులుఁ గూడు
కోల్పులేడులుఁ ♦ గూడి యాడు
చాఁగంటిమెకములుఁ ♦ జడలమెకంబులు
సయ్యాటలాడుచు ♦ సారెఁదిరుఁగు

గీ. చెట్టునట్టులు మేకలు ♦ చెల్మి నేయు
నిటులమెకములు పులుఁగులు ♦ నీడుఁబోడు
గలిగియీరసబాసియుఁ ♦ గలసిమెలసి
ద్రిమ్మరిల్లును తోటలో ♦ మమ్మరముగ. ౧౦౪

ఆ. ఔరయిచటి వున్నె ♦ మబ్బురం బయ్యెడు
జన్నిగట్టులెపుడు ♦ జన్నములఁ జ
నెయ్యిఁవేల్చుచుండు ♦ సేటగుఁబాబల్కు
సారముమీను లులర ♦ సొంపునేసె ౧౦౫

సీ. పూవుఁగుత్తుల నొప్పు ♦ దీవెలపై జుమ్మ
జుమ్మని మ్రోగెడు ♦ తుమ్మెదలును
కమ్మనిమావులఁ ♦ గలనవలనుఁ దిని
కూకలేయుచునున్న ♦ కోగిలములు
చిఁకటిమ్రానులఁ ♦ జేరి మబ్బులటంచు
నట్టాడుచుండెడు ♦ నమిలిగములు
దెసలనెక్కడనైన ♦ మినమినలాడెడు
కస్తురిపిల్లుల ♦ కమ్మతావి

ఆ. చదలనంటుచున్న ♦ జన్నంపుఁగ్రొంబొగ
తారదారినేగు ♦ వారియుల్ల
మలరఁజేసె నిచట ♦ నవ్వారి వనులైన
చక్కబడునటంచు ♦ చనువుగలిఁగి. ౧౦౬

ఆ. పోయిపోయి యెదుట ♦ బులితోలుఁబఱచిన
గద్దెపై నిరుసుల ♦ గమిఁగొలువఁగ
గూరుచుండి తెలివి ♦ గుర్తులుఁ దెలుపుచు
హారునమొడ్డలోన ♦ నగ్గలింప. ౧౦౭

చ. బసుసుము మేనఁబూసి చెలు ♦ వంబగు దామెరపూసలక్కునన్
మిసిమి జెలంగవేసి యుఱ ♦ మించుజడల్ జిగికావిపుట్టముల్
మసలఁగ కక్కపాలయును ♦ మచ్చికమీరఁగ దాల్చియున్న పె
న్రుసియగు గర్గనొక్కరుని ♦ నోములుబండగ జూచిరిమ్ముగన్.

చ. కనుఁగొని యంజదమ్ములకు ♦ గాదిలి మ్రొక్కులు మ్రొక్కిఁగుండెబ
త్తిని పౌనకాడ నెన్నుదురఁ ♦ దిన్నగ చేతుల జంటమోడ్చి మె
ల్లనరుసి వేల్పురాయనికి ♦ లక్కన మొప్పెడు సుద్దివాకొ నెఱ
దనఁదగు పోలుపొందువిని ♦ తమ్ముదలిర్పఁగ నేయునట్లుగన్. ౧౦౯

ఉ. ఓజడదారి రాయనిను ♦ మూరటకేకయు కక్కసంపురా
లోఁజచెలంగుదారులకు ♦ నోడక నాజవరాలిఁగూడి రా
దేజగతొల్లి పున్నెముకు ♦ దెంచుటచేఁ గడగండ్లబాసి మే
మీజతనంపుఁ దోఁటహారు ♦ వింపెసఁగన్ గనవయ్యెనియ్యెడన్.

ఉ. వచ్చినతోడనే నిటకు ♦ వచ్చితినాడు తలంపునీకు వా
క్రుచ్చితినన్న నత్తవసి ♦ కోమలునిం గనివల్కె నెమ్మితో
నెచ్చటికేగెదో యిచటి ♦ కేలనుదెంచితివేద ప్రోలు నీ
కిచ్చటఁగోరు గోర్కులున ♦ వేవియొ దెల్పుము పేర్మితోననన్. ౧౧౧

గీ. మధురనాప్రోలి లోపల ♦ మనికినాది
వేడుకను తేని కెవ్వాడు ♦ పీఁకమీఱ
పునుఁగుజవ్వాది గందముఁ ♦ బూయనిచ్చి
వచ్చెడు వలంతికమలినా ♦ వలపు రాణి. ౧౧౨

వ. నా పేరు కోమలుండ మే మిరువురము. ౧౧౩

ఉ. దొడ్డతనంబు కల్మిఁగని ♦ తొల్తటి కావల ముప్పతిల్లఁగన్
బిడ్డలు లేక బెంగగొని ♦ బెగ్గిలికంబును చిప్పిరిల్లఁగా
నుడ్డ ముగంబు వేల్పునెద ♦ నొప్పకము త్తికిఁ ద్రోవలేని కా
ఓడ్డెము వ్రాసె మాకును మె ♦ ఱుంగగునాయని యొక్కవేకువన్.

క. కలువరవడిరోసియు నా
యిటు చెలువలకంకెఁజేసి ♦ యిటురాఁగనుచూ
త్రొలిమేననేయు పున్నెం
బులుఁగలుఁగుటవలన మిమ్ము ♦ బొడగంటిమిగిన్. ౧౧౪

క. కారానిపనులు మీఁచే
గారాబమ్మున నుఁ దీర్పఁ ♦ గానగునంచున్
గోరిక నుడివితిమి నిరా
బారికఅసతమ్మివిచ్చు ♦ పగటిదొరయనన్. ౧౧౭

గీ. ఆలకించుచు జోగితా ♦ నబ్బురమున
కోమలుఁడుబల్కు సుద్దుల ♦ కుమ్ముఁ దేలిసి
జరుఁగబోయెడుఁ జరిగిన ♦ జరుగుచున్న
వైనములఁజూచి మాలిమిఁ ♦ బూనిపలికె. ౧౧౮

మ. వినువీడుఁగలమేల్ సుగంబులను ♦ వేవేపొంగగా సంతువున్
గనినఁగాని పునెంబుఁగల్గదని యీఁ ♦ గ్రాల్గంటితో వచ్చి మె
త్తనిమైతోఁదబమ్ముందుఁ గాసిలఁగనెం ♦ తం జేసి ముప్పోకలా
డానరింపంగల మేలునొందెదని యో ♦ హో తల్చితేఁ జూడఁగన్.

ఉ. నీవుదలంచి వచ్చినప ♦ నిన్నెరవేర్పగలందు నమ్ముమై
దేవరయిల్లుఁ జేకుమనఁ ♦ దెల్లమికై మఱిబల్కె యోరుసీ
తావరమందు నుండిపలు ♦ దారులనోములు నోచియుండఁగా
యేవగనైన సంతుగలి ♦ గించుటలేమిని గీము వెళ్లితిన్. ౧౧౯

వ. వెండియు జగమ్మున నల్వాయు. ౧౨౦

ఉ. సంతువటంచు మొఱ్ఱలిడి ♦ సారెకుమ్రొక్కఁగరాని వేల్పుమేల్
చెంతకుఁజేరి నేతగని ♦ నేతలునేసినఁగాని వారికిన్
వంతముఁ గట్టినట్లు మురి ♦ వంబునుఁజూపెను సంతుగూర్పకే
వంతల పాలుఁజేసియది ♦ వల్లనువారికి నిచ్చుపెక్కఁగన్. ౧౨౧

సీ. సిరిగలవారినిఁ ♦ జేయు తెగుల్లల
పేదలకాకలి ♦ బెట్టుపెక్కు
సమకూర్చుముదు కని ♦ జవ్వనికిచి జాణ
తకుఁగూర్చు తులువను ♦ తగుగోనములు

గలమేటికిచ్చు ని ♦ చ్చలు నెఱబ్రతుకును
బ్రల్లదునకు నిచ్చు ♦ బ్రదుకునిడుద
తేగముల్ గలవారి ♦ తెగకుతేమి యొసంగు
నీలేనివారల ♦ కిచ్చుకలిమి

గీ. గానఁదగనట్టి చెయ్దుల ♦ బూనిసేయు
నలుమొగంబుల వేల్పుకే ♦ కలవరంబొ
ముప్పాదప్పిన ముదుసలి ♦ యెప్పుడైన
సేయఁదగినట్టి పనులను ♦ సేయఁగలఁడె. ౧౨౨

వ. అయినను తొల్లింటి బాముసఁ జేసికున్న కసటునన్మాకు కొడుకులు లేనిది కొఱంతగలదియై ముగితిసుగంబు దప్పించినది గావున మీరు వివరించు వివరంబు తేటతెల్లమిఁ జేసి బిడ్డలుఁగలుఁగు తెఱఁగు లెట్టులనో యేర్పరించుటకు మీ యట్టి పెద్దలవలనం గదా కొంకులు విడుచుట యనుటయు ఱసిచందురుఁడు. ౧౨౩

ఉ. జవ్వనిమిన్న కోమలుఁడ ♦ సారెకు సారెకు మీతలంపులో
నెవ్వఁగ నొందనేల తొలి ♦ నిండిన దోసము మూఁడువంకలుకా
నివ్వటిలంగ కన్నెకయు ♦ నెప్పరియొక్కతె బుట్టుదానిచే
మవ్వపుమిత్తిగల్గు విసు ♦ మానవువంకలడంగు బిమ్మటన్. ౧౨౪

గీ. వెలయముప్పొక లెఱిగిన ♦ వేల్పుతేని
చెలిమిఁగావించు మగలాగు ♦ నేతతోన
తనివిసనఁ గొల్చికొడుకు నొ ♦ క్కనిని గనును
గానయిలుఁగూర్చి పొమ్మిఁక ♦ క్కనగు తలఁపు. ౧౨౫

క. నావినిరుసి మీసరయున
కావెలఁదుక బలికెముగితి ♦ నందించెడిదా
వావిరి ముమ్వంకలు దిగి
బోవుటెటుల చక్కఁజేయు ♦ బ్రోఁడయెవండో. ౧౨౬

సీ. అదిగాక కలుసాన ♦ నొదవిన దానిని
మఱపోకలాడేల ♦ ముట్టుకొనుచు
ముట్టుకున్నను లాఁతి ♦ ముద్దుగుమ్మలఁ జాల
నెనరు నించుటకేల ♦ నెగడుచుండు
నగడైపోయతఁ డేల ♦ నేనున్న తావున
కరుదెంచు నయ్యత ♦ గ్గనకబొమ్మ
గ్రుడ్డులోపలి పజ ♦ కూరిమిఁ గాచగ
దలచియుండెను గాదె ♦ తల్లిదండ్రి

గీ. వదెను బత్తులఁ బ్రోవఁగ ♦ దలఁచిపుడమి
కరుగుదెంచునో లేకయీ ♦ యున్నమిన్న
నొక్కరితె బ్రోవ నేతెంచు ♦ నొకలంకు
వీడిపోదె ప్రహాసంబు ♦ విఱ్ఱవీఁగ. ౧౨౮

మ. అదిగాకింతకు వెన్క బొమ్మునయహో ♦ యాకూసచే కొన్నమై
కొదుకుల్ నాకువటారిసుద్దులను వా ♦ క్రువ్వంగమీ కుందగున్
ముదితన్ మేమెటుగాంచ గల్గుదుమొ బెం ♦ పుల్మీర నీముద్దబె
ల్లిదవా దోసములేఁగులెట్లగునొ తా ♦ ల్మిన్ దెల్పి మన్నింపవే.

క. సిరిపెనిమిటికే తలలో
దుడుసగు నేతలనుఁ జేసి ♦ త్రుళ్లైనొనాకున్
దరవడిగఁ దెలియబల్కుము
పరిపరిడెందంబు చెదరె ♦ బమ్మెరఁ గలిఁగెన్. ౧౨౯

వ. అనినవిని రుసిమానికంబు నెట్టన రెట్టించిన సంతసంబుట్టిపడ నా
దిట్టరులఁ జూచి మీరు తలంకకుడు మీ తలంపోడఁ గూడు దానిని
తేటతెల్లమిఁ జేసెదనని యిట్లనియె. ౧౩౦

గీ. మునుపు బహుళాశ్వ్వడను రాచ ♦ పులికి వేల్పు
తపసిరాయఁడుఁ దెలిపిన ♦ దానిమీకు

తేట తెల్లమి జేయుదు ♦ తిరిగితొల్లి
బాముననుసేయుదురుసుల ♦ వడఁతికతను ౧౩౦

సీ. మునుపుసీత మగండు ♦ మొనసితడిరి యాన
కలికితో తమునితో ♦ కాన కేగి
పంచవటిని నాకు ♦ పాకనుగట్టించి
సుగముగా నుండగ ♦ శూర్పనఖయ
నెడు చెలియే తెంచి ♦ నేలనాయసి చక్క
దనమునుఁ జూచి త ♦ త్తరమునఁగదుర
వలరాయునికి మారు ♦ వలరాయుఁడగుఁ వీని
పొందులేని పలంతి ♦ పుటుగుపుటు కె

గీ. యనుచు మదినెంచి సంతోస ♦ మగ్గలించ
తాను వలపుమిటారియై ♦ దగ్గరించి
కలికిచూపుల జూచుచు ♦ కలిమిడిగను
బలికెమొత్తని మాటల ♦ బన్నరించి ౧౩౨

ఉ. రాచకొమార నాకువల ♦ రాయని కన్నను మిన్న వౌటచే
దోచెను పెండ్లియాడికల ♦ తోయము తీరమెలంగవచ్చితిన్
బ్రోచెదవో మఱేం వెకల ♦ దోచెదవో వివరింపుమన్న నా
రాచకొమారుఁ డొద్దికను ♦ రావణు చెల్లెలితోడ నిట్లనున్ ౧౩౩

గీ. మెలఁత నాతోడబుట్టువు ♦ మొలఁతలేక
యున్నవాడదె వానితో ♦ నున్న నీకు
జేజెపట్టునఁ గలమంచి ♦ జెందవచ్చు
ననినరక్కసి విని లక్ష్మ ♦ ణుని కదిసియు. ౧౩౪

ఉ. ఓమగనీదు చక్కదన ♦ ముఁవ్వీళులూరఁగ నేయవచ్చితిన్
నామదికోర్కె దీర్పుమని ♦ నాతుకబల్కిన నవ్విలక్ష్మణుం

డోముడఁతీన నుంగొనిన ♦ కూడిగమెప్పుడు సేయువాడనా
తోమతిఁకన్న కూడిగెపు ♦ తొత్తువటంచని బల్కె రేపజల్. ౧౩౫

క. ఆనివిని యిద్దరి చెంగటి
కిని యిటునటు తిరిగిరిగి ♦ కేఁచునుండన్
గనియొక్కటాలు బతమును
గొనుకశరధుగొడుకు వలపుఁ ♦ గొనకయెనుండక ౧౩౬

ఉ. చక్కడనాల కుప్పయగు ♦ చానను బ్రిమింగిన నన్ను గొందఁరం
చొక్కమెయిం దలంచిమురి ♦ యుమ్మెలమై జెలువొందఁ బ్రిమింగ బో
నక్కటయంచు ముక్కుచెవు ♦ లంటగగోయుమటంచు నన్న బీ
తెక్కఁగ జేయనట్టులొన ♦ రించెను తమ్ముఁడు కాఁకు దొల్గగన్.

గీ. ఇలుముకు చెవులుదరిగిన ♦ యింతియేగి
యన్నయగు రావణుని తోటి ♦ యున్నదున్న
యట్లు వివరించి సీతహా ♦ యలను దెల్పి
తెచ్చుకొనునట్లు జేసి య ♦ త్తెఱవపోగిలి ౧౩౭

గీ. అంతటను బోక కాఁకేని ♦ కంకియపడి
పుష్కరంబును తీర్థముఁ ♦ బోయియచట
మగవజయు సల్పితబము నె ♦ మ్మదిగసేయ
బూనివిరికందువను చాల ♦ పూన్కి జేసి. ౧౩౮

గీ. సరవివదివేల యేమునే ♦ సరములేక
మిత్తిగొంగను మదిలోన ♦ హత్తుకొనుచు
సేయగా వెండికొండను ♦ సీమగలుఁగు
గిబ్బతత్తడి రాతుతా ♦ కేరినిలిచె. ౧౪౦

ఆ. నిలచిదుగ్గి మగడు ♦ నెలఁత యేమిటి కోరు
కొనెదవేమొ తెలియఁ ♦ గనుపరుచుము

టంచు బలుకలేను ♦ తవరఁగా నిట్లను
వేల్పువేల్పుకొండ ♦ విడిచి చేజె. ౧౪౧

క. నాకోరిక వినుపించెద
చౌకనొనర్పంగవలదు ♦ చక్కనివాడా
రాకొమరుడు రామునికై
జేకొనమదికోర్కె బొడమె ♦ చేయుమన సీనెన్ ౧౪౨

క. ఒకటాలు బతిముబట్టిన
పకపకనగు మొగపురాచ ♦ పట్టిని చేప
ట్టకటా సాగునె యూర్కొ
మ్ముకరుంగునె వానిమెడద ♦ ముందగుకోర్కెల్. ౧౪౩

గీ. ద్వాపరములోన తుదకును ♦ తాతతండ్రి
చెలఁగి దేవకికినిఁ బుట్టి ♦ చెనఁటిపజను
ద్రుంపగావచ్చి నిన్ను చే ♦ నింపుగలుఁగు
కలవమును గొని యేలును ♦ గారవమున. ౧౪౪

గీ. అనుచు కోరినకోర్కిని ♦ యగ్గికంటి
యొసఁగి యేగిన పిమ్మట ♦ నొక్కపొద్దు
తోడనున్నంత వరకును ♦ తొలగని మొద
రాగవునిపైన మెలగఁగ ♦ రానయుండి. ౧౪౫

వ. బాముబామునకు పూవిల్తునకు పూవిల్తుఁడగు రాగవుండు దప్ప మరియొకరి నాకఅదకుతేఁడుఁ గాడని తలంచుచు నుసురులను వదిలె అది వెండియు ద్వాపరము తుదకు మధురయనెడు పట్నంబున కంసునికి బానిసెతనంబు సేయు కమలకోమలులకు జగము తల్లియగు చాలుపేరిటి సన్నవలఁతిని చెరబట్టించిన దోసంబీ బాముననగల వేసంబునకు మువ్వంకలు గలిగించి కుబ్జ నా పేరట జెలువారుచుండునని. ౧౪౬

క. ఈరవళితొల్లి తఱిలోన్
సీరామునికిం దొసంగు ♦ జేసిన దోసం
బారంగ శూర్పణఖయును
బారుగ ముక్కుంకలలకొ ♦ బాయును బొందెన్. ౧౪౮

ఉ. ఆతఱిలోన రామునిక ♦ యూరెరియొనర్చినసై బ్రతెల్లయున్
దాతదలంచి చూచితిగ ♦ వంకలుగుజ్జుతనంబు నిచ్చియా
నాతుక కావలంబుఁ జన ♦ నల్లని దేవర కాచునంచు మేల్
వ్రాతలు వ్రాసె నీతలఁపు ♦ వాలెము సాగును బొందు వేడుకన్.

గీ. మంచివారలఁ బ్రోవఁగ ♦ మఱియు చెడ్డ
వారిఁ ద్రుంపఁగ బామంది ♦ పాడినిలువ
నేలఁ బుట్టును కఱివేల్పు ♦ నీకు శూర్ప
ణఖయును నేలంతకలుఁగు నీ ♦ న్నానెను గను. ౧౪౯

సీ. అనితొల్లికతఁ దెల్పి ♦ యనుగుడంచవి బల్కు
మదికోర్కెఁ దెల్పు నె ♦ మ్మదిగ నాకు
బుట్టెడుకొమరిత ♦ ముప్వంకలలరిన
కఱివేల్పుతోడఁ జ ♦ క్కనగుననుచు
నుడిగితిరయ్యయో ♦ పుడమిని దేవర
యెచ్చటఁ బుట్టునిం ♦ కెచట బెరుగు
నెవ్వ రెవ్వరిఁ బ్రోచు ♦ నెదిరించుమార్తుర
నెవ్వరిఁ దెగఁ జూచు ♦ నవ్వడిగను

గీ. ఎట్టిపున్నెపు వానికిఁ ♦ బుట్టఁగలఁడొ
వానివక్కణమంతయు ♦ వ్వారిఁగాఁగ
తెలియఁబల్కుఁడు నాయెడఁ ♦ దిరముఁగలుఁగ
కనికరం బార కన్నయ్య ♦ కతనువినెద. ౧౫౦

వ. అని వేడుకొనిన నక్కమలకోమలులకు తపసిరతనం బిట్లనియె.

క. మీవీఁడు తేనికన్నగు
దేవకుడను రాజుకూఁతు ♦ దేవకియనఁగా
రావెలఁదుక యందుకఱి
దేవరయుంబుట్టి జగము ♦ తీరికసేయున్. ౧౪౨

వ. అదెట్లంటిరేని నేలపడంతి గోరిన తీరుగ, నేలకేతెంచి వలుగాకి పజలనెల్లతునిమి, నెవరిచే యెవరు బాగుపడవలయునో, చావు నొందవలయునో, అట్టివివరంబులు, నెరవేర్చి ప్రేపల్లెలో నందుని యింటనుండి కాగలచెయ్వుల జరుపుచున్నంత కంసుని పంపునయ క్రూరుండనువాఁడు మధురయను ప్రోలికిరా రాచదారిఁ గన్నయ్యయే తెంచి నీకుఁబుట్టుగు నొందు మూఁడువంకలు గలకుఁగుదకు.

ఉ. చక్కదనంబు లిచ్చునని ♦ జగ్గెనువక్కణమంతఁ దెల్పినఁ
జొక్కుచు కోమలింపు తన ♦ జోటికతోరుసి చందమామకున్
ప్రొక్కికరంబుగా నెలువుఁ ♦ బొందినుగంబునఁ బ్రోలుచేరి యుఁ
మిక్కుటమైన బుత్తులను ♦ మేలుగనుండిరి నోలలాడుచున్. ౧౪౩

గీ. అనుచు వివరింప ♦ విన్వచ్చు ననుగుకోడుకు
కోమరుడిట్లని బల్కెమ ♦ క్కువ చెలంగ
వెన్నునిసుమాళమగు కత ♦ విరివిసేయఁ
దగుదువనరుసి తెల్పె సం ♦ తసముతోడ. ౧౪౪

సీ. ముందుసోకులపాలు ♦ నంగిపుట్టిన రాచ
తరటులనెల్లనుఁ ♦ దాల్పలేక
పుడమిబమ్మనుఁ జేరి ♦ యదుగులపై వ్రాలి
తనపాటుదెల్ప ద ♦ త్తరముతోడ
వేలుపు ముక్కంటి ♦ వేలుపు పెద్దయు
పుడమి చేడియఁగూడి ♦ పోయిపోయి

పాలకడలిఁ జేరి ♦ ప్రాజదువులతోడి
ముప్పొకలాడెద ♦ మురువఁ బొగడి

ఆ. తాము వచ్చు సుద్ది ♦ తప్పకఁ జెప్పిన
వినితలంపుఁ దీర ♦ వినఁగఁ బలికె
వేల్పులార మీరు ♦ వేంచేయుడిక్కల
కేను దీర్పఁగలుఁగు ♦ నీకలంత. ౧౫౬

ఆ. మీరలేగి నేం ♦ మీరగుపాళులఁ
బుట్టియడు గొలాన ♦ మురుపుఁజూపు
డటులనందమార ♦ నచ్చరలందరుఁ
బూజసేయనాకుఁ ♦ బుట్టుఁడెలమి. ౧౫౭

ఆ. రుసులు నెల్లఁ బోయి ♦ రూపసి మొలఁతలై
గొల్లవారలయ్యు ♦ తెల్లనైన
యాలగుంపులయ్యు ♦ మేలిబిజములకు
పొంతతిగియలయ్యుఁ ♦ బుట్టుఁడనుచు. ౧౫౮

క. పనిచియు తానుంగలువల
యనుఁగుకొలమునందుఁ బుట్టు ♦ వగువను దేవుం
డను దొరకుఁబుట్టి తోడ్తో
డనె కంసుండనెడు సోకు ♦ డా కలకెదలోఁ౯. ౧౫౯

ఆ. తండ్రిబీతు నొంది ♦ తత్తరమున బావఁ
జేతఁబట్టుకొనుచు ♦ చెలఁగిత్రోవ
నడువతలుపులకును ♦ నాటినబీగముల్
తొలఁగిపోవఁ బోయి ♦ కలఁతదొలఁగి ౧౬౦

చ. జమునను దాటినందుని ప ♦ నందగుమేడనుఁ జేరిలోగిట
న్గొమరితతోఁ బరుండినయ ♦ నుంగుయశోదవలంతి సెజ్జపై

కొమరునిఁజేర్చి బిత్తఁగొని ♦ కుమ్మగతొల్లటి బందెకానికున్
గిమకిమవచ్చి చేరనది ♦ కేవుక కేవురటంచు నేడ్చెనర్. ౧౬౧

గీ. అత్తరిని కంసుడా నాదు ♦ నాలకించి
కత్తిచేఁబూని దేవకి ♦ కైనిఁ జెలఁగు
బిడ్డపుడమిసిఁ బడవేయఁ ♦ బెరసిపైకి
లేచి తనమేనుబెంచియు ♦ లెక్కఁగొనక. ౧౬౨

ఉ. ఓరిగరాసనిన్ దునుము ♦ టొప్పునె యెంతకురంగటంగలం
దూరకనిన్నుఁ జంపఁగలఁ ♦ డొక్కఁడు కారడెదగ్గరించెనో
రారజగంబు కొల్లలన ♦ హాకడుఁబెట్టిన యన్న మొక్కలై
జేరెనటంచు తానుపెను ♦ సిల్గులమాటలుఁ దెల్పిపోయెసన్. ౧౬౩

క. తనమంతిరి కొలమును గనుఁ
గొని తలపోతలను చాల్పు ♦ కుందుచుఁ జేయన్
వినిపూతనయను రక్కసి
దనగుండెనుఁ గల్గుతీరుఁ ♦ దార్కొణ జేసెన్. ౧౬౪

మ. వినుమోజేడ తలంకు జెందులకు వే ♦ వేగన్ గొమార్తె ల్గొమా
ళ్లను వెల్గొందెడు నూరుమెట్టి యులు ని ♦ ల్లుంజూచి సంతున్న నా
చిని పాపన్ వెసఁజంపి వచ్చెదను మీ ♦ సేనుంబుచేకూరు దా
నిని నీమిత్తలుప్రెగ్గడల్ సరియనర్ ♦ నెగ్గింతు నీ గుట్టులన్. ౧౬౫

గీ. అనుచు చెప్పినమాటల ♦ నాలకించి
తనకు రంగటమెలఁగెడు ♦ ననుఁగు కాండ్ర
నాల్గుదెసలకు బంపి వి ♦ న్నాణెమైన
గుండెతో కంసుడుండెను ♦ కూళలంత. ౧౬౬

సీ. పురిటింట బిడ్డల ♦ బొలియజేయు మటంచు
కంసుండు బంచిన ♦ కదలివేడ్క

నూరూర నింటింటి ♦ సొరఁగదిఁగి వే
సారకమఱియొక ♦ తూరిదిఁగి
విసముచన్నులఁ జొన్పి ♦ పసఁగలమేనితోఁ
పసిఁబాపలను జంపు ♦ పాలసిచ్చి
వలపించి పజలను ♦ వాలెముఁలోఁ గొని
పూతనయను సోకు ♦ పువ్వుఁబోఁడి

ఆ. నందుఁ డున్న గొల్ల ♦ మందకుపచ్చెసి
పాప యున్న జాడ ♦ పట్టిచూచి
రాయశోదయింట ♦ రానతోఁ గన్నయ్య
కేవు కేవుమనుచు ♦ కేకవినుచు. ౧౬౭

ఉ. లోపలి కేఁ పదెంబియొక ♦ లోపల మెచ్చుచుఁ దొట్లెనున్నయా
పాపనిఁ డగ్గరించి పసి ♦ పాపడ నాచవిగల్గు పాలన
య్యావరుప్రం జెలంగయల ♦ రారును వేల్పులఖోన యింకపాల్
చేపిదగైకొనం దగును ♦ చేకుఁడు జేజెలయుండ బాగముల్. ౧౬౮

క. చిటిపొటిమాటల తనపొది
గిటికిని లే నెత్తివాయి ♦ కిని చన్నయ్యన్
గుటుకు గుటుక్కని పాలొక
గుటుకను మైవిరచినీల్గి ♦ కుఱ్ఱఁడుఁ గుడువన్. ౧౬౯

చ. గుటుకు గుటుక్కటంచు నొక ♦ గ్రుక్కెడుపాలనుఁ బీల్చినంతలో
తటతట గుండియున్ వడఁక ♦ దప్పినగుట్టులుగల్గు మేనితో
జిటజిటలాడుచుండ గుడి ♦ చెన్ మఱి రెండవ గ్రుక్కయప్పుడ
క్కటకటమై పరాకుగొనఁ ♦ గాపసిబాపడునీడ ఖోవకే. ౧౭౦

సీ. మూడవగుటుకు కకు ♦ మురువగు మైపిడి
యిక చాలుచాలని ♦ యెత్తుఁబడిన

విడువక మఱియును విసపుఁ బాల్ గ్రుక్కను
  వీల్చిన నసిజెడి ♦ పెంచియొడలి
రక్కసిరూపును ♦ రక్కొనఁపై బడి
  యాడఁగ గొల్లెత ♦ లరసియరసి
మాయురే యిది యెంత ♦ మాయలాడి యటంచు
  మనముద్దులానిని ♦ మనుచు జేజె

గీ. యనుచు వేలమి బొట్టిడి ♦ యమాయశోద
కడకు గొంపోయిదించిరి ♦ కప్పురపడి
గొల్లలందఱు గొడ్డంట ♦ గొట్టిదాని
గాలిచిరి పోయెనది మంచి ♦ కలఁకునకును. ౧౭౧

సీ. మున్నెల్లకుట్టుఁడై ♦ మురయుచు దనకాల
  బండిసోకును గూల్చె ♦ గుండెలదర
నీరారు నెలలలో ♦ నెగసికసువ్రుసుడి
  నల్లఁద్రావుఁడుఁ బట్టి ♦ డుల్లనేసె
పిన్నపాయమునాడె ♦ మన్నుదింటివె యనఁ
  దల్లికి నోటిలోఁ ♦ దాతగ్రుడ్డు
లెన్నియో జూపించె ♦ నింతలోఁ దపసియా
  గర్గునిబిలిపించి ♦ కన్నతండ్రి

గీ. రమణతోఁ బేరుఁబెట్టించెఁ ♦ రామకృష్ణు
లనఁగ పెంపొంది యన్నతో ♦ నాడిపాడి
వారుసమిగు రొత్తదామున ♦ ల్లారుముద్దు
తల్లిదండ్రుల కిచ్చుచు ♦ నుల్లసిలిరి. ౧౭౨

శా. ఆలోఁ బ్రేతల యిండ్లలోఁ దిరిగిచు ♦ ట్లద్దింపుగా నిడ్డమే
ల్పాలుం బెర్గులువెన్న చట్లవయి కే ♦ లైవన్ దరిఁ లేక తా

బోలం బీటలువేసి యెక్కినయు మా ♦ ఱల్ దియ్యలేక న్వడిన్
గోలందూ టూనరించి దారకుచెయిం ♦ గు త్తించి ద్రావెన్మనన్.

ఉ. వెన్నుడు సేయునేతలకు ♦ వ్రేఁతలు నోర్వఁగలేక పోయిమా
విన్నపమాలకించుమని ♦ వేఁడుచు నీకొమరుండు పెర్గుచా
ల్వెన్నలనెక్క నీ కయిలు ♦ పీఁదులదాగి నరానకావలన్
గన్నెలనుంచి బోనకడ ♦ కన్వెనమూతికియుద్ధిపోయెడున్. ౧౭౪

క. మగనాలి నొకతెఁ జేయు
మగనికిసిన్ దెలుపుతీగ ♦ మగపోడుములున్
దగవివరింపఁగ నాకుం
దగుదువటంచని చెలుంగుఁ ♦ తమితోలాగెన్. ౧౭౫

క. ఏమనిఁజెప్పుదు మమ్మరో
మామాయిండ్లకును మెట్టి ♦ మసజవ్వనులన్
వేమూరు కన్నుసన్నల
దామగ పనిసేయఁజొచ్చు ♦ దగవెయశోదా. ౧౭౬

ఆ. నాకొమారుడింట ♦ నమ్మి నిద్దురఁబోవ
దూడతోక జుట్టు ♦ తోడగట్టి
కొట్టినంతనెడ్చె ♦ కోయనియుతడేడ్వ
నగుచు చూచెతగవె ♦ తొగలకంటి. ౧౭౭

క. కలవారి కొడుకటంచని
పలువితముల నోర్పుఁ గల్గిఁ ♦ పబలితిమమ్మా
చెలియెట్టులఁ జెప్పెదొబు
ద్దులు పసిపాపండు సేయు ♦ తోడుసులుగావె. ౧౭౮

ఆ. అనుచు దెలిపిన వ్రేఁతల ♦ ననిపికొడుకు
నేతలను పాటిబట్టక ♦ చెలఁగి యొక్క

పూటపేరయింటి కేగి యం ♦ పుగను పెరుఁగు
ద్రిమ్మిరిలించియు దాగెను ♦ బుసుతఁజూచి ౧౭౯

ఆ. కేలకోలను దూలించి ♦ జాలివాలి
దుడుకుపనులను జేసితే ♦ దొంగయనుచు
కోలజళిపింప బరుగెత్తి ♦ కుమ్మమునరిఁ
జేరి కంబాలనడుమను ♦ దాయుచుండ. ౧౮౦

శా. అమ్మా యెన్నడు నిట్టిచెయ్వులను నే ♦ యంబోనునక్ గొట్టకే
నెమ్మింజూడుము ప్రేతలాడు నుడుగుల్ ♦ నీగుండె కుందామరన్
నమ్మింబోకు మటంచు వేడుకొని వి ♦ న్నాణెంపు గందమ్ములన్
ముమ్మారంబుగ నీరుఁజాటులలి ♦ మోముంద్రిప్పి తా నేడ్చినన్.

చ. విడువకయయ్యశోదచెలి ♦ వెన్నునితో సరిదిగ్గిమోమునన్
బుడిబుడిచేఁ జెమర్పనికఁ ♦ బోయనికట్టనుఁ జూపిపట్టఁగా
నెడయయి తల్లికిన్నరము ♦ లెచ్చెనటంచును చేతజిక్కినన్
బుడతసి ద్రాకుటోటికిని ♦ బొట్టకుఁద్రాటనుఁ గట్టెఁగట్టినన్. ౧౮౨

గీ. పోరుతపసితిట్టు ♦ పాండుజక్కుల తోరి
కొడుకులిరువు రేగి ♦ పుడమిజమున
పొంతజోడు మద్దు ♦ లెంతయునై యున్న
వానికడకుఁ బోయి ♦ వ్రాల్చెఁ గూల. ౧౮౩

గీ. రక్కసుఁడు చాలబెట్టను ♦ రాపిడికిని
విరివివేఁగవల్లె విడనాడి ♦ బృందయనెడు
కానలోఁ జేరిగొల్లలు ♦ కఁడకఁగక్కి
గొలువఁగానుండె సుగములఁ గొనివతారి ౧౮౪

గీ. లేఁగపేరిటి సోకును ♦ లేకుఁజేసి
కొంగరక్కసుఁజీలిచి ♦ చెంగుమీర

యఘుఁడనేఁడు పోఁకుసప్పమై ♦ యలరనోటఁ
జొచ్చిమైఁజీల్చి గొల్లల ♦ జోకమని చె. ౧౭౫

సీ. జమున పొంతను గొల్ల ♦ చట్టము త్రోసద్దిఁ
గుడుచు మదూడల ♦ గుంపులొకట
మేయుచునుండఁగ ♦ మిందోవరుల పెద్ద
యేతెంచి లేఁగల ♦ నెత్తుకొనియు
సుడుఁగుబడన్ సేయ ♦ మాసకకన్నయ్య
దవ్వగాలేఁగలుఁ దాటెననుచు
మీరలీ సద్దులఁ ♦ ద్రింగుడటంచని
వెతుకఁగాఁ నేగెనా ♦ వెనుకనెమటి

గీ. నలువవిచ్చేసి గొల్లపి ♦ ల్లలనుఁ గవిని
దాచి తనచోటికరిఁగిన ♦ తలనుకట్టి
సకుఁడు వేంచేసి బమ్మమ ♦ చ్చరముఁ దెలిసి
వ్రేలఁపిల్లలలేఁగల ♦ వేసమూని. ౧౭౬

క. మేపెడువాఁడుం దానయి
మేపుచు మలుపుచునుఁ దానె ♦ మేయుచు నిండ్లన్
బాపలు తల్లులు లేఁగలు
జేపెడు నావులనుఁ గలసి ♦ చెలమిగనుండెన్. ౧౭౭

గీ. ఇటుల నాన త్తిఁగలుఁగగ ♦ నింటియందు
కానయుండలి చెరలాఁడఁ ♦ గా మటిపెఱ
వాఁరిఁగానావులకు గొల్ల ♦ వారలకును
కానుపించకఁ దానెమై ♦ గడిపెనేఁడు. ౧౭౮

ఆ. ఒంటిప్రోఁగొక్క నాఁడుమే ♦ లంటివచ్చి
గొల్లబుడుతల దూఁడల ♦ గుంపులఁగని

తొలిటిచూపులు విడనాఁడి ♦ తుల్లఁదూఁగి
కలిమి చెలితేఁపుచూపులఁ ♦ గలిఁగెనేమొ. ౧౮౯

గీ. అనుచు కతివేల్పునడుచుచు ♦ న్నంతసలువ
వచ్చి కేళివుల వ్రేపసిఁ ♦ బాపటెదుర
మెలఁగఁగాగని తనుఁదాచు ♦ మలగవికినిఁ
బోయి నిదురించు క్రేవులఁ ♦ బుడుతలఁగని. ౧౯౦

ఆ. బమ్మగుడ్డులోని ♦ పజలనెల్లను సేయు
నట్టినన్నెదిర్చి ♦ యడరులేకఁ
బుట్టఁజేసె గొల్లఁ ♦ బుడుతలఁదూఁడల
నేమిఁజెప్పవలయు ♦ నితనిపగ్గె. ౧౯౧

మ. అని లోలోనఁదలంచుచున్నఁ దలలో ♦ నయ్యారె కన్నయ్యరూ
పునుఁదప్పన్ జగమేమియుం గనకమ్ర ♦ బ్బున్గప్పఁదోడ్తోడ మే
ల్కని నేనెంతటిమోసపోతి జగము ♦ ల్గావింప మన్నింపగ్రొ
న్నన సోలింపఁగ మన్నియుండితనినే ♦ నాగెల్చియోడించుటల్.

వ. అని తలంచి యుంచనుడిగ్గి కేల్ తమ్ముల నెదుటఁగీలించి జొహారు లొనర్చి తనవలన జరిగిననేరంబు సైపుమని యగ్గించి వెండియు.

క. ముమ్మారుహాజఁ దమ్ముల
నెమ్మది తలబామిడికంబు ♦ నెలరతనపుడాల్
గ్రమ్మఁగ మ్రొక్కిడి పొగడుచు
నిమ్ముల కై యతనియాన ♦ నేగెఁగొని మనన్. ౧౯౪

వ. వెండియు.

సీ. ఆవుపేరిటి నల్లఁ ♦ దాఁవుఁడుఁ దెగటార్చి
తనయన్నతోఁ బ్రలం ♦ బునిఁ దునుమఁగ
నేసికాళియుఁ బట్టి ♦ గాసిలఁగావించి
మడుగులో నీటినిమంచిఁ జేసి

ఆలమందలు గొల్ల ♦ లార్చుచు కేలొడ్డి
కార్పిచ్చుమిగ్గిగి చో ♦ క్కముఁగఁ గాచి
చెలఁగి ప్రేతలమేలు ♦ చీరెల ప్రుచ్చిలి
తబసులయిల్లాండ్రు ♦ తగిన బగిలి

గీ. తెచ్చియిచ్చిన మేల్ బువ్వఁ ♦ దినికడంగు
పెద్దగొల్లలు సురతాణి ♦ పేరజరుపు
జన్నముసుమాన్పిగుట్టక ♦ చ్చంపుబత్తి
జేసివిందులొనర్చినఁ ♦ జేజతేఁడు. ౧౯౬.

ఉ. కినుకన్ దొమ్మిదిప్రమ్ములంగలిపి వ ♦ గ్గన్ బంపవిచ్చేసియు
ల్లనప్రేపల్లెను బృందకానఁగురియన్ ♦ లావై సరాల్ జల్లులన్
గనిగొల్లలొక్కటవెట్టి కావుమనఁగా ♦ గట్టొక్క కేల్ గోటితో
డనె లేనెత్తివటారిప్రేఁతలనుప్రే ♦ లఁగ గల్గి హూల్మందలన్. ౧౯౭

వ. జాకుండ తన నెఱజాణతనంబున వినువీఁడు నాయుం డేడురాతిరి బవళ్ళు వానఁగురిపించిన సుంతైనఁదూలకున్నంత నెవ్వరపడి జక్కుజక్కుననే తెంచి నేలనుఁబ్రోవఁగాఁ బుట్టినముప్పొకలాఁడుఁ గాని మానిసిఁగాడని తెలిసి నజ్జదమ్ములకెరఁగి యగ్గించి యుక్కన్నయ్య యానతింగొనిఁ దన పెంకికిన్ జనియె నంత నొక్కనాఁడు తామరపాక్కలికై వస్తుండు పూట నొరునాడునందుండు జమున జలకంబునందావంబాడుచుండ నందరపుతేని బంటొకండతనింబట్టుకొనిఁబోవఁ కతివేల్పది విని వాని గొటికికింజని తగిన మన్ననలం జెంది పితరునిందెచ్చె కావున నాప్రోడగాఁతుగొనియాడ నెవరితరం బిడియుంగాక. ౧౯౮

కం. తత్తరములేక వెన్నుఁడు
కత్తెరపున్నమఁజెలంగఁ ♦ గల నెలలోనన్

సత్తువఁగనొక్క రేయిన్
బుత్తిఁగగుంపనెడు సన్నఁ ♦ బొందినకానన్. ౧౯౯

మ. మరుగంజోఁగుల గుండెదామరలు వే ♦ మాపనలారింప సం
దరపుంగూఁతురుచన్నుబంతులను ని ♦ ద్దాపుల్కలంబుట్టఁగ
క్కరమారాల్గరఁగన్ దలిర్పఁ జిగి మొ ♦ క్కల్దీవెలుం జెట్లులే
సరి కెందామరక్రేఁగనుందుగలలె ♦ స్సంజూడ్కి సొంపారఁగన్. ౨౦౦

ఉ. పిల్లనఁగ్రోవి బాడినను ♦ వ్రేచెలులెల్లరు విన్కితోడనే
చల్లనజందమామ వెసఁ ♦ జల్లఁగ రాతిరివచ్చి వల్పుఁజో
త్తిల్లఁగ వ్రట్టువో చనులఁ ♦ బద్దినకస్తురిగందముంజవా
దెల్లను మేనునంట చెలు ♦ వెక్కఁగఁ గౌఁగిలియిచ్చి వెండియున్. ౨౦౧

కం. వ్రేఁతయు వెన్నుఁడు మఱియున్
వ్రేఁతయు వెన్నుండునిట్లు ♦ వేలకు వేలున్
జేతులు బుజముల నిడుకొని
బ్రాఁతిగ వ్రట్టువగ నిలిచి బాడిఁదిరుఁగుచున్. ౨౦౨

తే. గీ. జోటికలు వెన్నుఁడీ తెగ ♦ నాటలాడు
హాదనుఁజూడఁగ పదునెని ♦ మిదియుగణుతి
బమ్మపూటలు నొక్కరే ♦ బవలుఁజేసి
హాళిఁజెలువంద వ్రేఁతల ♦ ట్లాటలాడ. ౨౦౩

తే. గీ. ఇట్టుల వ్రేఁతలతోఁగూడి ♦ యించువిల్తు
దురములోఁగలమేరకుఁ ♦ దొంగలించి
పలువితంబులవారితో ♦ జలకములను
వేడ్కనాటాడిబంచెన ♦ వ్వేఁదులమఱి. ౨౦౪

కం. అబ్బురమగు చెయ్వులత
బ్బిబ్బెమియు లేకఁజేసి ♦ ప్రేముడిమందన్

గుబ్బకొనుతల్లి దండ్రుల
నిబ్బరమునుఁజూచి మెదిలె ♦ నిండినవేడ్కన్. ౨౦౫

వ. అంత సంతుకొరకు తోటంజేసిన కమలకోమలులు రుసినాసనొంది సుకంబుగా సల్లుంజేరి. ౨౦౬

క. ఉన్నంత కొన్నినాళ్లకు
గ్రొన్ననవిలుకాని రంతు ♦ కొనసాగఁగ మే
లెన్నునను చెంలాడెడుఁ దల
గ్రన్ననెల మసలెను బయు ♦ కారమెలర్పన్. ౨౦౭

గీ. కొలఁది నడుకలపసఁ దీఱె ♦ కోర్కెలూరె
చిట్టుములు మీఱె, చెక్కుల ♦ చెల్వుఁజాఱె
పెలుచమన్గోరె, మోము వె ♦ ల్వెలుకవాఱె
పొట్టయులరారె చవులనుఁ ♦ బొందగోరె. ౨౦౮

గీ. అసలుఁ బుట్టుగుపైవ్రాలు ♦ మిసిమి తేటు
లనఁగ వలుపెక్కు చనుమొన ♦ లలరెఁ జెలికి
దపసి కన్నావవెలుఁగులఁ ♦ దనరుకలువ
యనఁగ పొక్కిలివిప్పెన ♦ య్యతివకంత. ౨౦౯

క. చీటికి మాటికి మన్నన్
బోటికిఁ దినబుద్దివొడమె ♦ పొటుకున యులఁతల్
వాటిలె నిట్టూర్పెదగెను
నేటుఁగ ముమ్మూన్నెలలు ♦ నిండినయంతన్. ౨౧౦

ఆ. మంచితోయమునను ♦ మగువకు గన్నెక
బుట్టెనమ్మ లక్క ♦ లుట్టపడఁగ
సంతసంబుతోడ ♦ సలిపిరి పురుటాలి
కి పదిపూటలమునఁగఁ ♦ గేరుచవుడు. ౨౧౧

ఆ. చానకెల్ల జెలికి ♦ సంపెఁగినూనియ
దలకునంటి కమ్మ ♦ నలుగుఁ బెట్టి
నీటుఁ గుల్కఁ దాపి ♦ నీటిని మజ్జన
మూడఁ జేసిరపుడు ♦ పోడిమిగాని. ౨౧౨

సీ. పుట్టిన కూఁతునుఁ ♦ బొడఁ జూచి తండిరి
ముత్తికిఁ బ్రోవ యీ ♦ ముగుదయనుచు
మువ్వంకలునుఁ గాక ♦ మోము కోమలికము
ముజ్జగంబుల చాల మురువుఁ జూపు
ననిపెద్ద సంతోస ♦ మును సందరంబులో
నోలలాడుచు నెదఁ ♦ జాలిమాలి
తతిమీరకుండఁగఁ ♦ దగిన చెయ్వులఁ దీర్చి
బిడ్డచే గలిఁగిన ♦ బిరుదమనుచు

గీ. సాగి నందునిపల్లెలో ♦ చదలుకాపు
లలరఁ బెరుఁగుచు నున్నట్టి ♦ కలిమి నెలఁత
మగఁడు కన్నయ్య యెంతటి ♦ మానిసనుచు
తెలిసి తెలియని యట్లుండె ♦ తెలివిఁ గలిఁగి. ౨౧౩

ఆ. అప్పు డప్పడాలు ♦ నరిసెలు మండెంగ
లట్లు బుబ్బడమ్ములు ♦ పిట్లు మణుఁగు
బూలు దోసెలిడ్డె ♦ నాలు నేవెలుగార
లప్పచులునుఁ బుణుఁగు ♦ లొప్పఁ జేసి. ౨౧౪

ఆ. తెలుపుఁ గలిగి మిగుల ♦ మిలమిలరాలెడు
జోన మఱఁటికాయె ♦ పొందుపరచి
పులుసు పప్పుకూర ♦ పులుగము త్వేత్త్వర
వంట లమరఁ జేసి వలఁతుఁలపుడు. ౨౧౫

తే. గీ. గొప్పమొకమూలపులుఁగుల ♦ గొత్తగముల
దెచ్చి వేర్వేఱఁదఱఁగియు ♦ వచ్చియొఱచి
లోన మేలేరికలుకుట్టి ♦ యసదలిపఱ
బూని సేసిరినిప్పాక ♦ లూని చెలఁగి.  ౨౧౬

ఆ. వె. క్రొత్తకుండలందు ♦ క్రోసిసపాలసుల
పులుఁగునంజుడులను ♦ పొందుపరచి
నారసుంచినూనెఁ ♦ గట్టాటికట్టాటి
పలువితంబులొప్పఁ ♦ బదిలఁబరచి.  ౨౧౭

కం. కొంతన్నమ్మనతియ్యవ
కొంతన్పుల్లనఁగనేసి ♦ కోర్కెలొదవఁగా
యింతులు మెల్పంతులు నే
మంతులఁ గొప్పాలను దుత్తిని ♦ మదిమదిమీరన్.  ౨౧౮

కం. సింగారమలర నెలఁతలు
పొంగలిపాలోగిరంబు ♦ పులిహోగిరమున్
ముంగలనిడి దేవరలకు
పొఁగిజలకమెదుటఁవార్చి ♦ పొదలినబగిదిన్.  ౨౧౯

కం. ఒకచేకల్లుంగొని వే
రొకచే పొలపఁబుఁదీసి ♦ యొకఁడరఁగొనఁగా
సుకము చెలఁగనిచ్చుచు పే
ర్మికలుట్టిపడంగ ♦ ద్రావి మేలనియొదలోన్.  ౨౨౦

తే. గీ. ఇంటి తెరవర్లబోనము ♦ మించియున్న
వెట్టినీళ్ళనుచేకొని ♦ వేఁడుకలను
మీరఁద్రావుచు నువ్విళు ♦ లూర పెరసు
లారఁగించిరిలాహిరి ♦ నగ్గలింప.  ౨౨౧

కం. కలనందుగలుఁగు గొనములు
నలరారఁగ యానియాని ♦ కలబందుగులున్
పలుమారు రొదలుఁబెట్టఁడు
తలయూపను లెల్లమాని ♦ తరలిరి మేటుల్. ౨౨౨

సీ. ఒకఁడు పాటలఁబాడి ♦ కొకిబికి వేసంబు
బూని చిందులుఁద్రొక్క ♦ బుద్ధిమాని
ఒక్కఁడొక్కసిబట్టి ♦ చక్కఁగఁగాఁగిట
నొత్తికల్గ్రివించి ♦ నొదుగ సేయు
మొకనక్కెమాడుచు ♦ నొకఁడు చియ్యనునోట
బెట్టిలేదని కేలు ♦ వేయుచుండు
తనచాయదనయట్లఁ ♦ దనరతిగ్గాడిన
బట్టఁబోయితురీనఁ ♦ బడునొకండు

తే. గీ. యిటులకైవునవేవట ♦ యొనకరింప
మేనులూఁగఁగనడుకల ♦ మిసిమిఁదొలఁగ
నెఱులు రేగగ కన్నుల ♦ యొఱువు లెదుఁగ
పవ్వళించిరి బడలికఁ ♦ బడి తలంప. ౨౨౩

కం. ఇంతులరతనములందఱి
బంతులుసాగించి బువ్వ ♦ పళ్ళెరములలో
సంతుగ బెట్టిన మొసవిరి
పంతుగమిత్తులునుతోడి ♦ బందుగులుపజల్. ౨౨౪

ఆ. వె. వెలఁది కూఁతుకొరకు విందులుఁగావించి
మిసిమిగొలుసులలరు పసిఁడితొట్లె
గట్టిబిడ్డనుంచి ♦ బెట్టుఁగ చెలులంత
జోలబాడిరచట ♦ మేలుమీర. ౨౨౫

ఆ. పెద్దలంతఁగూడి ♦ పేరిమిఁదళుకొత్త
పెలుచకుబ్జ యనెఁడు ♦ పేరుఁబెట్టి
రేటఁబెరుగుపాప ♦ బూటఁబెంచిరివని
యారుగణుతియేఁడు ♦ లరుగునంత. ౨౨౬

తే. గీ. అప్పుడప్పుడు తలిదండ్రు ♦ లబ్బురంపు
సేతలనుసేయు కన్నయ్య ♦ చెప్పు లెన్ని
మాకొమార్తెకు మగఁడైన ♦ మంచిదనుచు
బలుకముసిముసి నగవులు ♦ వడఁతినవ్వు. ౨౨౭

తే. గీ. పుట్టినదిగో లెదురుసుల ♦ పోవడములు
లేకకన్నియలనుఁగూడి ♦ వీఁకనాట
పాటలనుబ్రొద్దుబుచ్చుచు ♦ పలుకువలన
కన్నయగొనాలనెల్ల చ ♦ క్కవనిఁదెల్పు. ౨౨౮

ఉ. మంద యశోదయింటికిని ♦ మాటికిమాటికివచ్చి పోవువా
రందఱు నల్లమేనిదొర ♦ యబ్బురమౌకతలెల్లఁ జెప్పఁగా
విందుగవీనులన్వినుచు ♦ వేడుకఁజెందుచు మైగగుర్పఁగా
నందయశోదలేమిటి నొ♦నర్చిరొ బాగెముగల్గుచెయ్వులన్. ౨౨౯

వ. ఇట్లు మధుర యను పట్నంబున డెందంబుకొందలబడనీక నంద కొమారుని యడుగుదమ్ములకై జోహారుసలుపుచు కన్నులఁ గన్పడు బాగెంబునకై యెదిరి సూచుచు కంసునిరాణికి పూట పూటకు తావిగలగందంబులిచ్చి వచ్చుచుండెనట. ౨౩౦

క. దుగినుని బసనుండియు ము
జగముల మేలరయఁదలఁచి ♦ నయ్యైనవచ్చెన్
జగడాల తిండిరుసిరా
జొగిసేలకు నొక్కనాడు ♦ హరాయలుఁ జెలంగన్. ౨౩౧

సీ. మునుమున్నె మధురకుఁ ♦ జను దెంచి కంసుని
చే గారవమునుఁ జెంది ♦ చెప్పెనప్పు
డేకతంబుననుండి ♦ యీావుల మొదవుకు
సరిదూఁగు మొదవుల ♦ చాలుఁ బ్రేలు
తలఁపనందుడుయశో ♦ దయు రోహిణియు వసు
దేవుఁడు దేవకి ♦ తెగయదువులు
మొదలుఁ గాఁగలవారు ♦ చదలు కాపులుఁగాని
మానుసులునుఁగారు ♦ మఱియుఁదొల్లి

గీ. కాలనేమివిసీవును ♦ గానపుడమి
గావబుట్టిన కఱివేల్పు ♦ గాని కట్టి
చెలియు చెడుపులుఁజేసిన ♦ చెనఁటిపజను
జంపిపాడిని నిలుపు నీ ♦ జగమునందు — ౧౩౨

సీ. మిన్నుబల్కిన పల్కు ♦ లెన్నిబీతునుఁజెంది
పసికూనలనుఁ ♦ జంపపట్నములకు
పల్లెలకీవంపు ♦ బలగము నందఱి
వేపల్లెలోనున్న ♦ వెన్నుఁడకట
తెంపరియైఁ జంపె ♦ దెలియదు నీకది
యనిరుసి చందురు ♦ డరిగెనంత
దేవకి కడుపునఁ ♦ జేవఁగా బుట్టిన
కొడుకుల నార్వురఁ ♦ గూల్చి పిదప

గీ. చెలియలినిఁ బావఁదలిఁదండ్రిఁ ♦ జెరనుబెట్టి
కువలయాపీడమను నేనుఁ ♦ గును నెదురను
ముష్టికునరిష్టు చాణూరు ♦ మొదలుఁగలుఁగు
బిరుదులను రచ్చలోనిల్పి ♦ బెట్టుచెడక. ౧౩౩

గీ. ఎల్లగొల్లలు విచ్చేయ ♦ విల్లునన్న
జన్నమును సేయు నెపమును ♦ బన్ని చెలులు
మంతురులుఁ దానుతలపోసి ♦ మందనున్న
వారిరప్పింపఁ దలఁచె న ♦ క్రూరుచేత. ౨౩౪

సీ. కంసునిపూనచే ♦ కదలి యక్రూరుండు
వ్రేపల్లెకేగిన ♦ వేడ్కనొంది
నలమేని దొరయు మ ♦ న్ననసేయ హరుసించి
తనరాకఁ దెలుప నం ♦ దయునుఁగూడి
విలునన్నజన్నము ♦ వేడుకఁజూడఁగ
వన్నుఁగ నన్నతో ♦ బయనమైన
తరువాతి నందుండు ♦ తగుపెద్దగొల్లలు
మిసిమి పాల్పెరుగులు ♦ మేల్దినుసులు

గీ. మొదలుగాఁగల కాన్కల ♦ మొసరి రాఁగ
మధురకేఁతెంచు తెరువులో ♦ మరునిగన్న
తండ్రిచూపించె తొల్లింటి ♦ తనదురూపు
బగిలితోఁజూచె నక్రూరు ♦ డొగిజమునను. ౨౩౫

ఉ. ఎప్పటియట్ల కన్పడిన ♦ యేలికవెన్నునిఁజూచి తేరుపై
జప్పున నెక్కి వేనడచి సౌరగు ♦ పట్నముఁ జేరితోఁటలో
జప్పరమందు నిల్చియు బ ♦ జారున రానొకచాకివల్వలుక్
గొప్పరమందు నుండఁ దల ♦ గొట్టి వళావళిఁదాల్చి రొప్పుగన్.

వ. అంత బోయిపోయి. ౨౩౬

ఆ. సోగులిచ్చువాని ♦ చోటుకు వేంచేసి
వాడొసంగు సరులు ♦ వరుసదాల్చి
కలుములిచ్చువాని ♦ కలకును విడనాడి
త్రోవవచ్చుచుండ ♦ తొట్రుపడుచు. ౨౩౭

క. ఆతీరుఁ దారినడుచుచు
పూతకునై గంధముఁగొని ♦ మువ్వంకలచే
నాతుకకుబ్జయు రాఁగ
నీతలకాకోరఁ గొనఁగ ♦ చిక్కనివేడ్కన్. ౨౩౯

గీ. కట్టిమనుమడ నేనేమి ♦ కతలుఁజెప్ప
దచటికెదురేగె మువ్వంక ♦ లలరుచున్న
గుజ్జునా చెలిగంధముఁ ♦ గొనియొడయుని
కియ్యఁగా బోవగనివెన్నుఁ ♦ డిట్టులనియె. ౨౪౦

ఉ. ఎవ్వరిదానవీవు కుల ♦ మెయ్యది నీకిడు పేరదేమొ కో
యివ్వలవున్న గంధముల ♦ నెవ్వరికియ్యఁగ నేగుదానవో
నవ్వడిదెల్పుమన్న హరు ♦ సంబున దెల్పెను రాచలైన మీ
మవ్వపునుద్దికిం బదులు ♦ మాటనుఁ జెప్పఁగ నెంతదాననో. ౨౪౧

సీ. వినఁ దెల్పెదమీర ♦ లాలించు డోగికంసు
వంపుడ నల్లని ♦ వన్నెఁజేజే
కొజ్జదమ్ములఁ బుట్టు ♦ వందినవారిమేల్
కోలము మాయది పేరు ♦ గుజ్జయండ్రు
పన్నీరుజవ్వాది ♦ బల్తావికస్తురి
గంధముగల కోర ♦ లందిమెప్పుడు
దేవేరికిచ్చెద ♦ దేవరకొనియెడు
తలఁపున్న చేవట్టఁ ♦ దగుదురహహ

గీ. తొల్లి మేనునఁ నేజేయు ♦ దురుసుపనుల
దోసమెల్లను నిన్నుఁ గం ♦ దోయిచేత
జూచినంతనె సమసెని ♦ చ్చోటకలవ
మొదలఁబూయుము నకులతో ♦ హెచ్చరికను. ౧౪౨

గీ. అనిబలికి గందమిచ్చి యా ♦ యబ్బురికేలు
మొగిచినిలిచిన చినఁగు ♦ తెగయ మొగము
నిగనిగలు వారికలపము ♦ నెమ్మికాంద్రుఁ
జూడఁ జేసొని బలికె మె ♦ చ్చుగను చెలికి. ౨౪౩

ఉ. పాయమునందు నీకుగల ♦ వంకర ముప్పిరివోవునట్లుగా
మేయిసిఁ జక్కఁజేయుదని ♦ మేల్కడకంటి వటారిచూపులన్
బాయకఁ జూచి చిత్తరము ♦ బాహిరమై వెలుగొందఁ బోరపై
బూయుచు నన్నయుం జెలులు ♦ బూయగనిచ్చెను బూసిరందమున్

గీ. పూసియక్కటికముఁ బూని ♦ పొలఁతి చెక్కు
క్రిందనొకకేలు హజ్జల ♦ యందుహజ్జ
లుంచి మొగఁదీయ చద ♦ లున మించునల్ల
మబ్బులో మెఱుపుదీఁగకు ♦ మాద్రిబోలి ౨౪౫

తే. గీ. రంగుమీరంగ పొంగారి ♦ రాణయెసఁగఁ
మంతనంబున వలపోత ♦ కొంతఁ జేసి
చెలియొయ్యారపుఁ జూపుల ♦ చెలిమి వెన్న
దొంగపైఁ గలపసిఁడిచె ♦ ఱంగుబట్టె. ౨౪౬

ఉ. వాలుగడాలు క్రొన్ననల ♦ వాలునకుం జెలిజంకునొంది కాం
తాళము,బూని నేర్పుఁగల ♦ తట్టసమాటల నల్లవేల్పుతో
మాలిమిఁ బుట్టనిట్లనియె ♦ మన్ననసేయు మురంతులోన నీ
జాలము మానుమన్న నగి ♦ చామనమై దొరబల్కె వెండియున్.

క. కనుసన్న నన్నఁ జూపుచు
వినుమా చెలిమేమువచ్చు ♦ పీటిపనులు దీ
రినమీద నీదుకోరిక
లనుఁ దీర్చెదనింక నీకఁ ♦ లకునకుఁ జనుమా. ౨౪౭

క. అనిపలుక సమ్మతించి మ
రునఁగన్నయ యచోటువాయ ♦ రోకులుఁ దోలఁగన్
గనుఁబొలఁతి మానికంబును
తనయిల్లునుఁజేర జనియె ♦ తాలిమిగదురన్. ౨౪౯

తే. గీ. అనిని రాబారి చందురు ♦ డానతీయ
విని పరిక్షిత్తుఁడనురాజు ♦ వెన్నదొంగ
కతను జానుగులలరగ ♦ కలదలోన
హారున మిగురొత్త వెండితా ♦ నసియె బెలుచ. ౨౫౦

ఆ. వెన్నుఁడేగినంత ♦ వెలఁది కోరినయట్లు
కుబ్జమేడఁజేరి ♦ గొనెనొసుగము
దెలియఁ జెప్పుడయ్య ♦ తేటతెల్లంబుగ
వినెద యెసకమెసఁగ ♦ వీనులలర. ౨౫౧

(కలహంసోత్సాహవృత్తం)

విసపుతిండి తగరుకౌతు ♦ వెనుకతేఁకు నెత్తులం
దెసగు బొమ్మిడికపు రవ్వ ♦ లెనయుఁ దేజులొప్పగన్
ముసరిహజ్జదు గలఁగేలు ♦ ముడిచి మ్రొక్కు వేడగా
కసటుఁబాసి యులరసేయు ♦ కజియమేని వేలుపా. ౨౫౨

(తరళవృత్తము)

పసిఁడిసాలువ సెల్లసంద్రుని ♦ పట్టినట్టిద సీటియి
కుసరిపేరులు రొమ్మునంగుడి ♦ కైన దాపటికేలునం
దెసఁగు సంకునుబిల్లు వాల్గొని ♦ హెచ్చుపుల్గు హుమాయిపై
పసిఁగనెక్కి వయాళిసల్పిన ♦ సామిమేల్మలదాలుపా. ౨౫౩

(గద్యం.)

ఇది శ్రీమద్రమాంగనాంగ మందారలతోత్తుంగ స్తన స్తబకస్థిత
శృంగార భృంగాయమానలక్ష్మీ నృసింహకృపాలబ్ధ వాగ్వై
భవ భగవద్భాగవతార్చనాతత్పర చతుర్విధ కవితా
పరిబంధ నిర్మాణచాతుర్యధురీణ ఆంధ్రభాషా
ప్రవీణ హారితసగోత్ర పవిత్ర రంగాచార్య
పుత్ర నల్లంతిఘుల్ చక్రవర్తుల ఠంయాల
లక్ష్మీనృసింహార్య కవినాథ ప్రణీతం
బైన అచ్చతెనుగు కుబ్జాకృష్ణ
విలాసంబను సింగార కబ్బం
బునందు ప్రథ
మాశ్వా
సము

శ్రీ

శ్రీమతే రామానుజాయ నమః

( శ్రీలక్ష్మీనృసింహ పరబ్రహ్మణేనమః )

శ్రీ విష్వక్సేనాయనమః॥

# అచ్చ తెనుఁగు కుబ్జాకృష్ణవిలాసము

( ద్వితీయాశ్వాసము )

---

కం. సిరిచెలియెద కలపముతో
గరగరిక న్మొసలిబ్రాసి ♦ గవుఁగసిరమొనా
మెరమెరఁ గలుఁగగ మలిపిన
మరునికి మరుఁడవగు వేల్పు ♦ మలనరసింగా.

వ. ఆలకింపుము. ౧

తే. గీ. నావిని వలంతిరుసితేని ♦ తోవెలంది
ముచ్చటలఁ దెల్పవినుమని ♦ మురిపెములర
నట్లు నలమేని దొరతోడి ♦ యానవొంది
చనితనదు తావునకుఁ జేరె ♦ సంతసమున. ౩

తే. గీ. తవరకన్నయ్య చేతముట్టడము వలన
వంకరలుఁబోయి మంచిమ ♦ వ్వంపుతనము
నొందె నావలపూట వూ ♦ టందరువుగ
మమ్మరించెను జవ్వన ♦ మెమ్మెతనము. ౪

క. ఆజవ్వన మంతంతకు
　తేజఁగలిగెఁనంతటికిని ♦ తేరినదా నా
　హాజవ్వని ముజ్జగముల
　తాజుగలుఁగువారి కనులఁ ♦ దగపండువయెన్. ౫

క. దాని మెఱుంగుల యొడలున్
　దాని యొయారంపునడలు ♦ తళ్కుగు తొడఁబున్
　దాని నునుకురుల చకచక
　లానలువయు గణుతిసేయ ♦ నలవిఁయె దలఁపన్. ౬

ఉ. రంగుమెఱుంగు నిద్దపుహొ ♦ రంగును మీరెడువాలుఁగంటిలే
　మింగల కౌనుఁగాంచియెద ♦ మిక్కిలి నివ్వెఱగంది జంకునన్
　సింగము నత్తినింగొలిచి ♦ చేవగలంపగ వచ్చిచూచి గ
　ల్వంగడఁ గానకే చలిమ ♦ లంగవిఁదూరెను నాటనుండియున్. ౭

ఉ. కన్నెకమోము చందమున ♦ గంగొన చీకటిగాము గ్రమించి తా
　చెన్నగ చన్నగట్టులనుఁ ♦ జేరిన నందగలేకఁ గ్రక్కువన్
　వెన్నునకేగనో యునఁగ ♦ వేడుకమీరఁగ వాలుగంటికిన్
　పన్నగ కీలుగంటుగను ♦ వట్టెను కన్నులపండువౌ లలిన్. ౮

సీ. కమ్మదనంబగు ♦ నిమ్మపండులఁజూచి
　　　కత్తికోతలపాలు ♦ గాఁగఁజేయు
　గన్నెరుగుత్తుల ♦ చెన్నువఁదొలఁగించి
　　　ప్లెల్లున గోరులఁ ♦ గిల్లఁజేయు
　తఱిమల పెంపొందు ♦ తరివేల్పు వేలుపు
　　　దాయలచేతులోఁ ♦ దరుఁగసేయు
　జక్కవపక్కులు ♦ నిక్కనఁ గనుగొని
　　　జోడువిప్పఁగసేయు ♦ వేడుకలర

గీ. ఇటులనుబ్బును మెలిమి ♦ కటికెతనము
చక్కదనమగు వట్రువ ♦ సిక్కుచున్న
నసలుఁ బుట్టుఁగు మె ♦ ల్కంటి మిసిమిగుబ్బ
అలరె సింగార మెల్లనుఁ ♦ జిలకరింప.

క. మీలాకన్నుంగవన
ద్దాలా చెక్కిళ్లు విలువి ♦ తాలా బొమ్మల్
లాలావాతెఱ మసమగ
ఆలాపలువరుస మరుగు ♦ ఆలా పల్కుల్. ౧౦

క. చెందొవల దూరుకన్నులు
కెందమ్ములఁ గ్రేణిసేయు ♦ గేరెడడుగులున్
చందురు బురణించెడు మో
మందముగల చెలినిఁజూడ ♦ నబ్బురమయ్యెన్. ౧౧

క. విండ్లాబొమ్మలు తమ్మల
తూండ్లాకేల్ దోయిమిసిమి ♦ తో[illegible]రం బగు పూ
చెండ్లా గుబ్బలు మెత్తని
డిండ్లా లలి పిరుదులలగు ♦ తెఱవకుఁ దలఁపన్. ౧౨

క. తమ్ములు కన్గవనన మొ
త్తమ్ములు మైతావిరాము ♦ తమ్ములు నుడులం
దమ్ములు మేన్మెఱుఁగులు గు
త్తమ్ములు చన్నంగడి పరి ♦ తమ్ములు సొరముల్. ౧౩

ఉ. నెలసరిఁదూఁగు మోములలి ♦ నించిన కన్గవనిండు పండువె
న్నెలఁ సరిఁదూఁగు చిన్నగవు ♦ నీటగు నాచునుబోలు పెన్నెరుల్
నెలసరిఁదూఁగు మైవలపు ♦ నిగ్గనిగారపు బంగరంపు వ
న్నెల సరిఁదూఁగు మైమెఱుఁగు ♦ నెల్తుకమిన్నకుఁజూడ నబ్బమై.

చ. చిలుకలనంచ తుమ్మెదల ♦ చిన్నెలడంచు మడంతిసుద్దులున్
గులుకు నడల్ పొడల్ సొబగు ♦ కోల్కొన వాతెఱపాజ్జయంగనుల్
చెలఁగిన మేనుతావి లలిఁ ♦ జిక్కిన వేనలిముక్కు సొంపులున్
గలిగి జగానఁ దీనిసరిఁ ♦ గానముటంచు పొగడ్డకెక్కెనా. ౧౪

చ. వఱదొరబొడ్డు కేళకుళి ♦ శాటను మోనునుమాముఁ జూడఁగా
వలఁచియు నుల్కు లందడలు ♦ చాటఁగ లేక యె చాచిగట్టులం
గలుపఁగ పిల్లవంతెనను ♦ గట్టిన చాలనిగట్టినట్లు పొ
క్కిలి చనులంటియూరు వెలి ♦ గీఱ లలిమీరఁగ కల్వకంటికిన్.

సీ. నసవిల్లుచే ముల్కు ♦ లను వగునఱఁటుల
కడువడిరా కొట్టు ♦ పొడలు దొడలు
కుందనపుం దళ ♦ కుల తెలిపిట్టల
కడరుఁ బుట్టించెడు ♦ నొడలునడలు
చిప్పఁదాల్చినవానిఁ ♦ జప్పమొల్చిన వాని
నీళ్లలో మునుచుమీ ♦ గాళ్లుగోళ్లు
పులుకాసి పులుఁగులఁ ♦ బొలుపు కెందమ్మిల
బిడియము నొందించు ♦ నుడుగులడుగు

గీ. లనుఁగుచేపల మలమించు ♦ కనులు చనులు
మించుసంకును మ్రబ్బును ♦ మెడయు జడయు
పొలుపు సంపెగియద్దముల్ ♦ ముక్కుచెక్కు
లనఁగవెలఁదికి పెంపొందె ♦ నౌరబళిర. ౧౬

క. డాలాపిక్కలు కొంబవ
డాలాకెమోవి తమ్మి ♦ డాలా యడ్గుల్
వాలా మూడ్కలునునుసవ
రాలా జడతీవి బొంగ ♦ రాలా చన్నుల్. ౧౭

సీ. కానరానడుగుల ♦ కాని బాముల నంద
గాఁజేయఁగాఁ జాలు ♦ కలికి యూఁగు
నీటిపుట్టుఁగు నెత్తు ♦ నీటఁబుట్టఁగ నీయు
కొమరారు సొగసైన ♦ కుతికెతీఁగె
పల్ గొమ్మమొకముల ♦ బల్సిగ్గు నొందించు
నవలమెల్ రతనంపు ♦ నగలదాని
పదియారు వన్నెల ♦ బంగారు నిప్పుల
నుడికింపగాఁ జేయు ♦ నొడలసోరు

గీ. పువ్వుముల విల్లుచేపట్టు ♦ పోటుకాని
కిగలవాలును మించున ♦ మ్మగువచూపు
లలరు కెందమ్మిలను ద్రొక్క ♦ లలరసేయు
కన్నుఁగవయొప్పె కలికికి ♦ చెన్నుమీర. ౧౯

చ. అవగడమంది లచ్చిచొ అహో యని ♦ బీఁతునుబ్బి త్తి గొంగక్షి
దవులఁగ యామిటారి మొలఁ ♦ దాగిన యంతిరి తేరుగంబు నా
రివిలుల కోరులుం బెఱవి ♦ రెప్పవు సుద్దిసారంబు ముంగురుల్
దవులుఁగ బొమ్మచూపుల వి ♦ తంబయునం గొనబెట్టి మ్ములన్

సీ. అచ్చెలిమేల్మేలు ♦ పొచ్చపు కానెంచి
తెఱవాయి మొకములుఁ ♦ బొటియదూఱె
కల్కిపల్కుల కులికి ♦ పిల్కచిల్కల పోఁబు
లాటతోటల ద్రిమ్మఁకొం ♦ లలరఁబాఱె
యక్కలికి కెక్కుడై ♦ సిక్కునారిదలంచి
నెట్టనసప్పము ♦ ల్బుట్టఁజేరె
కడువడి చేడియ ♦ నడలకు నెడఁగాక
యంచల నొడలుతె ♦ ల్పామొనేల

గీ. సంపెగింపు పరిధ ♦ వింపనో ముక్కునుఁ
కెంపు సొంపుపెంపు ♦ నొంపుమోవి
మెఱుఁగు నొఱపుసేయ ♦ బఱిపెను నెమ్మోను
చందమామ యందు ♦ మొందుమొగము. 20

ఆ. తూలమేలుఁ దూలఁ ♦ జాలుకస్తవతిమ్మి
పూలఁబోలు కేలు ♦ మేలుచీఁకు
వాలుకీలుగంటు ♦ లాలుఁదేలిన మోవి
డాలుపూలగు దెల ♦ నేలుచనులు 21

సీ. తమ్మిలు వ్రక్కలై ♦ తళుకుఁబోవిడితలల్
పొట్టలఁ దాబేళ్ళు ♦ బెట్టుకొనియె
అఱఁటులు గొడ్డంటె ♦ నఱుకుళ్ళఁ బడిపోయె
సింగముల్ గవులలో ♦ జేరిడాగె
వసిఁడిచెంబులు నీట ♦ బల్మారు మునిఁగెను
తావిమంకెన విడి ♦ తఱుచువాడె
కెంపుకంటులు కానఁ ♦ గేరుకొమ్మలఁ జేరె
నప్పుము ల్వెసపావ ♦ జగముఁ జొచ్చె

గీ. హజ్జదుగలకు మీగాళ్ళ ♦ కలుపుతొడల
కరయు నడుమునకును చను ♦ లలరుటకును
కీలుగంటు సొరంబునుఁ ♦ గేరుమోవి
కెలమినోటమి జెందుచు ♦ లలిదొరంగి. 23

చ. చిలుకలు నప్పుముల్మెఱుపు ♦ చేపలు నచ్చెలివల్కు కీలుగం
టులలిని మేనుకన్నులు పొ ♦ టుక్కునఁ గన్గొని గెల్వలేకకొం
మ్మల వెనఁజేరె ♦ బుట్టలను ♦ మూళముమైగొని దూఱెబైలునన్
వలనుల మీరె హెచ్చు గరు ♦ వంబునుబోవిడి నీటఁబారెనా. 24

సీ. చిన్నిచీమలఁబారు ♦ చెలిమిన్న నూఁగారు
మామచెల్వను మీఁదు ♦ మోముదాఁటు
తాఁబేళ్లు మీఁగాళ్లు ♦ తళ్కుచుక్కలు గోళ్లు
నెఱకలడాళ్లు వ ♦ న్నియనెమళ్లు
వడియాఁకువన్నెల ♦ బంగారుమై తీగ
కారుసప్పము జడ ♦ సొగుసేరు
పలుచాలు ముత్తియం ♦ బుఱ్ఱబారు బొండూఱు
పిల్కచిల్కలపల్కు ♦ కల్కిపల్కు

గీ. కమ్మనగుతావి మైతీవి ♦ కావిమోవి
కళ్కుతమ్మిలఁ గలహోయి ♦ కన్నుదోయి
నూవుబువ్వుముక్కు సద్దంపు ♦ తేవచెక్కు
లలరు ననచెండ్లు పాలిండ్లు ♦ చెలువకలుగు. ౨౫

ఉ. తమ్ములదాయ తేజు తెలి ♦ దమ్ములబాజు తళుక్కుమించుట
ద్దమ్మురువాణముఁ గలిపి ♦ తగ్గసి నిగ్గునుఁదీసి బమ్మ తా
నెమ్మనివేల్పు జవ్వనుల ♦ సివ్వటిలంగను సేయునట్టులీ
కొమ్మమొగంబెలర్చ్పమఱి ♦ కోల్కని చెక్కిలి కన్నులున్నగుల్.

క. ఇట్లా చెలికఱివేలుపు
మాట్లాడిన మాటలకును ♦ మల్లిఁడిగొని తా
కట్ల విరివిల్తుఁ డొసఁగఁగ
చాట్లకు వెఱగంది మేడ ♦ చక్కికి జేరన్. ౨౬

క. అట్టితఱుణమున ననకా
రుట్టిపడెఁ మగలఁజెలుల ♦ హాయలకు బలుకుం
బిట్టలకును రా తెలినెఱి
పిట్టలకుం గోయిలలకు ♦ పేరిమిఁబుట్టన్. ౨౭

తే. గీ. వరలు తరియనుచిత్తారు ♦ వ్రాయువాఁడు
విరిహూదన తేని కెదలోన ♦ వేక్కఁ బుట్ట
కెంపురాల్గూర్చి కొలువున ♦ కేరి కానక
బెట్టెనోయనఁ జిగిరించెఁ ♦ జెట్టులెల్ల. ..29

సీ. కొండాట మెదఁగల్గ ♦ గోరువంకలగమి
వంగడంబుల వగ్గ ♦ వరుసదెలుప
చిగురాకు మేవరి తో ♦ గల కోలలవారు
సొరదిసుందర బరా ♦ బరులు నడువ
పులుకాసిపులుఁగుల ♦ పొదులు దండితనంబు
కుత్తుకలెత్తుచు ♦ కొసరుచుండ
కొదమతుమ్మెద గాణ ♦ లెదనసలారంగ
పసగలపాటలు ♦ బాడుచుండ

గీ. యంచపులుఁగులు చెలరేగి ♦ యాటలాడ
తివియలను కొమలువారతు ♦ ద్దెచ్చిపట్ట
గాలిపడిగాపు వెంబడి ♦ రాలలిఁగను
వచ్చెననకారు కందువ ♦ పాదుసాహి. 30

ఉ. తాలిమిపూల కారనేఁడు ♦ దాది సరాసరి మారువాణమా
పాలడలందు తియ్యనగు ♦ పాలనుఁగూర్చిన యుగ్గునింపిమే
ల్మేలని తేటిపిల్లలకు ♦ మేకొనివచ్చె ననంగకమ్మనీ
ర్వాలెము నిండిపూవుగమి ♦ బాగుగబూచెను తీఁగెలన్మసన్. 31

క. చిగురులచే నాకులచే
మొగడలచే పలు వితాల ♦ పువ్వులచే చెం
గుగ కాయలపండులచే
దగవెలిగెన్ నిండువిరిహ ♦ దను మేల్మేలై. 32

తే. గీ. అంత నట్టింటిలోఁగడ ♦ నందమలర
పడుకగదిలోన బంగారు ♦ పనిచెలంగిన
గొలుసు తొట్టియుపై పూల ♦ కుదురుఁబరము
పాన్పుఁ గనుఁగొని పైకెక్కి ♦ పవ్వళించి. ౩౩

క. నిట్టూర్పులు నిగుడఁగనొక
దిట్టరిఁ గనులారఁజూచి ♦ తిమ్మసలేకే
రట్టడిదేవర నేమని
దిట్టుదునిపుడోర చామ ♦ దేవర బాపెన్. ౩౪

క. పిమ్మటను హెచ్చరించియు
కమ్మని విలుకాఁడుత్రుళ్లి ♦ గరకటిలేకే
తమ్మిములుకులను నెదపై
గ్రుమ్మెననుం సొమ్మసిలఁగ ♦ కువ్వాడముతో. ౩౫

ఉ. బెగ్గిలిబేలనైతినిఁక ♦ బేసిలకోరుల కానితండ్రిమై
నిగ్గులు నాదుకన్నుఁగవ ♦ నిల్చెను చక్కెరబొమ్మ యింకని
వగ్గను వానికేదొకనె ♦ వంబిడి నాదగు చెంతఁ జేర్చినన్
నిగ్గదలేకపోయినను ♦ నిచ్చయమిచ్చట మోసపోవుటల్. ౩౬

క. అనిఁ బొరలుచు మైమరచుచు
వినుఁజూచుచుఁ దెసలనెల్ల ♦ వెఱ్ఱెఁగఁ గనుచున్
ననవిల్తునిఁ దూఱుచుఁ గ్రొ
న్ననబోఁడి వితాకునొంది ♦ నవితను మునిఁగెన్. ౩౭

తే. గీ. ఇటుల దమకంబుఁ గొనియెడ్డ ♦ కటకటపడి
మైమరచియున్న చెలియను ♦ మగువలెల్ల
చూచి చలువపనుల్జేసి ♦ సొద్దమైన
మాటలనుఁ జెప్పిరప్పుడు ♦ మంచిగలుఁగ. ౩౮

క. ఓనవల యీ విరాళిం
బూనికుమారిల్లుచుండి ♦ పుయిలోటమిచే
నానఁగొని మాకు నీవ
క్కాఁణము వినుపింపకిట్టి ♦ కటికతనము మేలే. ౩౯

క. తగుపటువె తామరాకున
నిగులన్వీనమొల్ల బ్రమ్మ ♦ మేవరిపించన్
దగుఁక కదలినవైపున
మగువామాకటఁ దలదరె ♦ మలికిత మొప్పన్. ౪౦

తే. గీ. అయిన యిటువంటి పనులెద ♦ నానుకొన్న
వాదనుఁగోలెను ప్రొద్దేగ ♦ హాయిమీర
వరలు వోమనగుంటలు ♦ వలపుఁదీర
నెత్తములనాడ బాగగు ♦ చిత్తరమున. ౪౧

క. చెలియేరికి కళవలమొద
గలిఁగిన తోయమున చెల్మి ♦ క్రొల్గంటులతో
మెలఁతోఁటలోనఁ ద్రిమ్మరు
టలలిచేఁగునమ్మ నక్క ♦ టాబోద మొగిన్. ౪౨

క. అనుచు నొయ్యారికి నుడివిన
వినితేఁగ మెలుంగుతోడ ♦ వెలఁదిమొదలి నె
ల్లనెగాదిగఁ జూచుచు వా
కొనె బంగరుబొమయు మరుని ♦ కొమయగు కొమయున్. ౪౩

క. ననఁబోఁడి నీమదింగల
పని సేయుమటన్న చెల్మి ♦ పడఁతుక వేగన్
పసిక త్తెల హెగ్గడిక
త్తెను బంపితలంపులెల్లఁ ♦ దెలివిడి సేయన్. ౪౪

ఉ. వారెకలోనఁ బొంగి చెలు ♦ వంబగు పల్వలుఁ దాల్చి తోఁటలో
మూరుఁగ ద్రిమ్మరిల్లుటకు ♦ బుగ్రటకొమ్మలు సొమ్ములెల్ల సొం
పారఁగనంది గుంపులయి ♦ యూరట మొందెడు కుబ్జచెంతకున్
జేరియలర్పుమీరఁ బలు ♦ చిట్టక మొప్పఁగ కేల్మొగిడ్చియున్.

క. హరుసించివారి సంగతి
సరిఁజూచి బిటారమిం ♦ పెసఁగ నిలుడంచున్
సారదిగ నుత్తరువిడెనొ
క్కరినందులఁజేరి బలికె ♦ కమ్మనినుడులన్. ౪౬

క. ఓనవలాయిచ్చోట నిక
తానకమైనను నికంబు ♦ తహతహ లెదలో
బూనుచెలఁ దోఁటఁద్రిమ్మరఁ
గానలఁకువఁ బోవునంచు ♦ కటుఁదదలఁచితిగా. ౪౭

క. అననా యొయ్యారుతామా
టనువిని చెలితోఁపునకు వాలు ♦ టాహుటిబోవన్
దనుకు విడిఁబోవు విని మా
మనవినిచే కొమ్మకొమ్మ ♦ మంచిదిరమ్మా. ౪౮

ఉ. నావినిరొయొక్క చెల్మిగల ♦ నాతి మెఱుంగు బుజంబుపైనకై
తేవఁగలిర్పవేసితన ♦ తెంకినివే విడనాడి పూవుబోం
డ్లీవల నావలన్నడువ ♦ నింపగుతోఁటనుఁదారుచుంటకై
ప్రోవుఁగతూడుతిండిగమి ♦ పొల్పగు నెన్నడలంజనందగన్. ౪౯

ఆ. వె. పోయిపోయియెదుట ♦ పువ్వుల జొంపము
లలరకమ్మపాదల ♦ చెలులపౌజు
గాంచి యెదలమెచ్చి ♦ కలికి మేటిరొయొకర్త
కుబ్జచెంతఁ జేరి కూర్మి ♦ బలికె. ౫౦

మత్తకోకిలావృత్తము

కమ్మరేగునునంటి పాదిరి ♦ కాంచనంబుక చోరముల్
నెమ్మిచండ్రినాసమోదెవ ♦ నేలతామర రావి దా
ళిమ్మ వేము తినాసయున్నొగ ♦ లింగమంకెన మోదువుల్
కొమ్మమానికపూఁకనుంగొను ♦ కోర్కెలుప్పొంగులూరఁగన్. ౫౧

కరిబృంహితవృత్తము

కోరితొలకరి సూడ్లు వలకులు ♦ క్రొంచలికుకలపుల్గులున్
బైరులును పులుకొసిపులుఁగులు పావురములుకులావుకల్
సారెలును జతిజుట్టుపులుఁగులు ♦ జక్కవలు నెలఁ దౌవుడుల్
మీఁది వలపుల రాయుడూరమున ♦ మేలుగా దిరిగాడెనే. ౫౨

తే. గీ. వెలఁది జాజినిపూఁగురి ♦ వెంద జుట్టఁ
దోఁచెవగ కాఁడొకర్తను ♦ తోరమొదవు
గలుఁగుచుండఁగ జేసాచి ♦ కౌఁగిలించు
వితముఁగన్పడెఁ జూడుము ♦ వింతఁగలుగ. ౫౩

చం. చెలువపుదాఁడినిమ్మలను ♦ చిల్కలుముక్కుల నొక్కుచున్న నా
చెలుఁటుఁ జూచి జంకెడద ♦ జేరఁగను త్తల పాటుఁజెందిరా
వలపులతేమ మావివిరి ♦ వాలికతూఁపులఁగూర్చి నొసముల్
కలుఁగ వెలందిమానికల ♦ గట్టి చనుంగవ నేయుచుండమై. ౫౪

కం. వగదొండపండుపై సొం
పుగ వాలుగడాలుగురము ♦ ముక్కానిన చొ
ప్పుఁగనినఁ దగ మొగఁడొకచెలి
నిగనిగమను మోవినొక్కు ♦ నెఱిగనుపడిమెన్. ౫౫

వజ్రహారవృత్తము

తిమ్మఁగలిఁగిచూడవె చెలి ♦ తీవగుంపు చెంగటన్
కొమ్మలొటులేక మొగలగూడియుండె నర్మిలిన్

తమ్మిఁగల్గి చూడకె చెలి తీవెగుంపు చెంగటన్
కొమ్మలోటులేక మొగలఁగూడియుండెడినర్మిలిన్. ౫౬

కం. పూవులకమ్మని తావులు
తావుల సొగసైనయొజ్జఁ ♦ దనరుగు పూవుల్
పూవుల సొంపగు తీవెలు
తీవెలఁగడు ప్రిదిలిననలు ♦ తీరగుక్రొవ్విరుల్. ౫౭

చం. నెలఁతుక తెల్లరా మొగము ♦ నిటగుదమ్ములఁజూచి తుమ్మెదల్
వలచి తురీసవచ్చి చెలు ♦ వంబున మూకొని కమ్మనీటికి
మెలఁగుచు ముక్కుగాంచి యుత ♦ మిన్గొనసంపెగయుంచు సారెకున్
సలకువఁజెంది జంకుతెద ♦ నాటఁగ ద్రిమ్మరితెన్వెలందుకా. ౫౮

కం. ఈరమణముద్దరాటికి
నారెము నంగలుఁగువింత ♦ లరుసములొలుకన్
గారహినిఁ జెప్పనువ్విళు
లూరఁగ నొకరొకరుఁగూడి ♦ సువిదెవిసంగెఁ. ౫౯

తే. గీ. ఒక్కముదఁతుకహాసంబు ♦ పిక్కటిలఁగ
కేకిసలుఁగొట్టి పూపొద ♦ రోకుఁజూపు
వ్రేలఁజూపుచు సయ్యాట ♦ వ్రాలి చిలుక
పిల్కపల్కను బల్కెను కుల్కులొల్క. ౬౦

ఉ. పుష్పాడి దీవులున్ ననుచు ♦ పూవుల తావులు విచ్చుక్రొవ్విరులున్
గుప్పనిమూవులున్ గమియు ♦ కొమ్మల రేవులుఁగల్గుచున్నవో
పుప్పుఁబోణులార చెలువుం ♦ గల నీమెలఁదోఁటలోనసీ
టొప్పఁగ నాటపాడుటకు ♦ నొప్పను సోమదొలంగునర్మిలిన్. ౬౧

కం. అని వాక్రుచ్చిన చేడియ
విని మదిలో బాళిఁజెలఁగ ♦ వీఁకను నొకక్రొ

న్నినఁబోఁడి బుజముపై చే
తినివేసి యొయారమొనవ ♦ తిరుఁగఁగఁజనియెన్. ౬౨

చం. చసకనె బొమ్మరిండ్ల హారు ♦ సంబుసలేపెనుబట్టి కాంద్రఁ తెం
చెనుమసతమ్మితూండ్ల పసఁ ♦ జెండఁగఁగఁ గ్రొవ్వు పూలచెండ్ల నె
మ్మిని దినుకమ్మపండ్లకలి ♦ మింగనుగోసెఁ గుత్తిదండ్ల నా
డెసట పసిండిగిండ్లలిఁ ♦ డీకొనఁగా జవరాండ్రగూడియున్. ౬౩

ఉ. కొమ్మలనత్తమిల్లు విరి ♦ గుత్తులగోరులఁగిల్లు గేఁగిన్
బొమ్మలనల్లు పొన్నసన ♦ పుప్పొడిచేతులఁ జల్లుతావిపూ
రెమ్మలగిల్లు కందువిగు ♦ రించిన తానెడఁదూపటిల్లు చొ
క్కుమ్మడి సొమ్మసిల్లు మది ♦ నోటమిఁగల్గిన పెల్లుపెల్లునన్. ౬౪

ఉ. మొల్లలఁజూచి నిక్కు నుర ♦ పొన్నలసీడలఁదక్కు పండులన్
గొల్లలుఁగాను మెక్కు పువు ♦ గుత్తులతో సిగలోన జెక్కుమేల్
మల్లెలఁగాంచి సొక్కునన ♦ మావులగన్గొని మొక్కు జేజెకై
యుల్లములోన మ్రొక్కుచను ♦ వొప్పఁగ జిక్కుపడంతిదాటుకున్.

కం. ఈపరుసునఁ జెరలాడుచు
నాపఁడతుకమిన్న తోటి ♦ యతివెలకెల్లన్
బూపొదలఁనిచ్చఁ దిరుఁగం
గావగ్గఁజెలంగయాన ♦ గావించెనొగిన్. ౬౬

తే. గీ. యానతిచ్చినతోడనే ♦ యలరుబోండ్లు
కాలుకారగు పొదలను ♦ దూటిదూటి
యంచలకు సిగ్గుఁగదుర నొ ♦ య్యారమొదవ
సడలనడుచుచు కొందఱు ♦ నవలలపుడు ౬౭

కం. చిల్కలగొల్కి యొకతె వం
ధులఁగోసెను క్రొత్తసనల ♦ దులిచెనునొక కో

యిల కుత్తుక తుమ్మెదచా
యల నెఱుకలఁబోటిఁ ద్రావె ♦ నలవడు తేనెన్. ౬౮

ఉ. రవ్వలు కెంపు లుస్సిరివిఁ ♦ గ్రాలఁగఁగూర్చిన కోటయోయనన్
మవ్వపుతీవెయిండ్లనడు ♦ మన్నెలగాలనుఁ దీర్చఁగద్దెపై
జవ్వని యోర్తుకూరుచొని ♦ సారెకు సారెకువీనె సారెలన్
నవ్వుచు బిగ్గజేసి వల ♦ నంగడు పాటలఁ బాడె నత్తఱిన్. ౬౯

ఆ. వె. మఱ్ఱియూడనెక్కి ♦ మగువనిస్న యొకర్తె
యూగుచుండ బిగువు ♦ నుప్పరంబు
నంటబోయి మనను ♦ నింటికెలంకు కెం
దమ్మి గమినిదన్ను ♦ తమకుఁదోచె. ౭౦

ఉ. తియ్యని మావిపండులనుఁ ♦ ద్రెంపియు కుప్పలుబెట్టి యొక్కమే
ల్తొయ్యలిసాటి చేడియ ♦ తోఁదగగేనఁగి బొమ్మ పేరణం
బొయ్యనఁజేసి నెయ్యమున ♦ వాళ్లిఁగ పాటలఁ బాడి కొంతతఱిన్
వియ్యపురాంఁడ్రటంచు మఱి ♦ విందొనరించె నొయారమొప్పఁగన్.

క. తేటుల మొత్తము కమ్మని
తేటంగల తేనెఁ ద్రావి ♦ తిరుఁగఁగ నెమ్మిన్
బోటియొకతెఁ జిలుఁగుముసుకున్
బోటిఁగఁ జూపించి వాటి ♦ పురి విప్పించెన్. ౭౧

తే. గీ. చెలువలిద్దరు పువ్వుల ♦ చెండులాఁడు
తరి నొకటి నొక్కరిత పైటఁ ♦ దవిలిఁ జిక్క
మూఁడు పాలిండ్లుఁ గలిఁగిన ♦ ముగుద యనుచు
పొలతులందఱు నవ్విరి ♦ పొల్పుమెఱఁగ. ౭౩

క. కంటుతనంబున తుమ్మెద
కంటువు పువ్వునొక్క వాలు ♦ గంటి కొనుచు ప

ల్పంటి ముకునకును గాదని

వంటవలఁతిపైన మరల ♦ బారఁగవేసెన్.		౭౮

ఉ. తిండ్లకు కమ్మనై మెసఁగు ♦ తేటులువాలెఁడు పూలగుత్తి పూ

బోండ్లకు వ్రేలఁజూపి చల ♦ మున్మదిఁబుట్టఁగ జూచి నాదు పా

లిండ్లకు సాటి రావనుచు ♦ లేచుయొకర్తుక కెంపుఁబార లేఁ

దూండ్లనుఁబోలు కెల్దుగల ♦ తో విఱిలించెను హా సుమిూరగన్.

క. నవల రతనంబు లొకయెడ

గవకవలుఁగ యొకరికొకరు ♦ కమ్మని నుడుల

న్వివరించిరచటి సొద్దెము

ల వలపులుసిమ్మెర మొగము ♦ లను నవ్వోలయన్.		౭౯

సీ. అలమావిఁ జేదుగ ♦ లంట నెచ్చెలి యోర్తు

గోరంట కౌఁగిలిఁ ♦ గొనె నొకర్తు

పొగడఁగల్లు మివేసి ♦ పూఁబోడి యొకరిత

కంగేలిఁదన్నె నొ ♦ క్కరిత నగిమొ

పొన్న దాపునఁ జేరఁ ♦ బోయి నొకర్తుక

గోగుల మేల్మెుడి ♦ కొనరె యొకతి

చెలిమోటి వావిలిఁ ♦ జేరి నిట్టూర్పిడి

నొకతిఁ బొట్టుఁగు నక్క ♦ టికమునఁ గని

తే. గీ. ప్రేంకడంబుల నొకసకి ♦ ప్రేముడి వగ

మేలుపాటలఁ బాడియు ♦ మెలఁత యొకతి

సంపెఁగిని పాట మొగమున ♦ సొంపుమిూర

పుష్పములఁ గల్గఁజేసిరి ♦ పూనికగను.		౭౭

(ద్వి ర ద గ తి ర గ డ)

కలికి కనుతోఁట సిం ♦ గారముల గారముల

పొలఁతులకుఁ జల్లుగం ♦ బూరలను బూరలను

దట్టించి మొక్కవిరి ♦ తావులను తావులను
మెట్టవే వీఁవిఁగను ♦ మేనడిసి మేనడిసి
కూటువుఁగ దూఁకుమనె ♦ కొమ్మలను కొమ్మలను
నీటుఁగా దెమ్మ దా ♦ నిమ్మలను నిమ్మలను
పొలుపొంద యేఱునుర ♦ పొన్నలను పొన్నలను
గొలుకరించెదు నేగ్గు ♦ గున్నలను గున్నలను
నిలచి యూపితిని గ ♦ న్నెగుప్పూల్ నేరుపూల్
వెలుఁగ సిగఁజెక్కుకురు ♦ వేగులను వేగులన్
తిరిగి నవ్వలకేగి ♦ తేనెలను తేనెలను
తిరముగా దిద్దు వలఁ ♦ తీనెలను తీనెలను
చేరుగాఁగూర్చు మట ♦ జిగురులను జిగురులను
పోశేల మల్లియల ♦ పొగడలను పొగడలను
తేలిచిచూఁడుము గిరక ♦ ద్రాఁకులను ద్రాఁకులను
వెలిపేలనిక కుబ్జ ♦ వేడుకము వేడుకము. ౭౮

క. ఈరమణ నొకరి కొక్కరు
వేరులతో వారి వారి ♦ బిలుచుచు తమదే
వేరిని వేసుచు నచ్చట
కోరికలూరంగ నాడు ♦ కొనఁదగు ననుచున్. ౭౯

క. బుజములకై లొడ్డుచు చెలి
పజలిరువంకలను నిలిచి ♦ పరిధవ మొప్పన్
గుజగుజ రేకుల నాఁడిరి
గజిబిజి యెడలోన వదిలి ♦ కానను వేడ్కన్. ౮౦

తే. గీ. తీగె యీరములోఁ జేరి ♦ తెలివమిన్న
లెదల హారుసంబు బెనఁగొన ♦ నడఁటఁ గలిఁగి

కొంతవడికిని నలుగురు ♦ గూడికూడి
యచ్చనాలాఁడిరచ్చట ♦ యిచ్చదీర. ౮౧

క. ఉప్పచ్చులు ♦ గొబ్బిళ్ళను
కుప్పిలునుదన్ను బిళ్ళ ♦ గుడిగుడిగుంచా
లుప్పెన బట్టెలు ♦ నిరికి
ల్దప్పకనాఁడిరి మురిపెము ♦ దళుకొత్తంగన్. ౮౨

వ. ఇట్లాజోటిమేటి బోటికత్తియల కూటువల కూటమితోయాట
తోఁటలుఁజేరి చెఱకువిలుతు డొరబెఱికిన నిగనిగ మెఱుగులీను
విరికఱుకుటమ్ముల నెఱిమీరి నత్తెఱవ కడకంటి చూపుల నెల్ల
దెసలఁ బరికింపుచు కమ్మనితమ్ముల కమ్మనీరు నెమ్మినిదిమ్మదీరఁ
ద్రావి మమ్మరమ్మ మమ్మరించ జుమ్మజుమ్మన రోదాళమ్ములు
సేయు తుమ్మెదల మొత్తమ్ములు కొమ్మల ముంగురు లొక్క-
మ్మడింగని తమకొలమ్మని లేచి ద్రిమ్మరిల్లుచున్న గఱుల చాయ
లంజూచి నిబ్బరంబగు మ్రబ్బులనిగొబ్బున నుబ్బుచు తమతమ
పించియమ్ములవిప్పి తుంపెసలాడు పించెపుకుంచె పిట్టలను మెల్లె
మెల్లెన కాలియందియలు గల్లుగల్లుమన నదలించుచు గుబ్బకొను
గబ్బిగుబ్బల బరువున పిడికెడు మేరఁగల నడుముగడగడ వడుకుచుండ
వెడవెడ నడుకలు తడబడగ రాయంచల కొయ్యారంబుఁజూపుచు
చల్లని పిల్లగాడ్పులు మెల్లమెల్లనవీన తెల్లని మొగడలు కొల్ల
లుఁగ వెల్లివిరియ మల్లియలపొదల నల్లనఁదూఱుచు జారుబండ
లం జారుచు గొప్పనగుచలువ చప్పరంబులఁదూరుచు మెప్పముఁ
గల యరంటితుప్పల దెప్పలగు కప్పురంబుల తావుల కప్పడప్పడు
జేరుచు పుప్పుఁ బోడులపై పుప్పొడులఁ గుప్పుచు చిన్నిచిలుకల
పలుకులకులికి నిలుకడలేని డెందంబున వానిని రొప్పుచు తఱసారం
బునకు కోయిల మొత్తంబులీడుగావని బిత్తరంబున తత్తరంబులేని

సౌరంబుల కూయుచు పువ్వుటీరంబులం డాయుచు జక్కవపక్కులు
నిక్కవచ్చిన సొగసుగల తొగలరాయని నిగనిగలవగులు మొగ
ముంజూపి దిగులుఁబడ నేయుచు పూలగురివెంద పందిరుల నెక్కుచు
తియ్యని మావిపండుల మెక్కుచు నలరుల నేలబడ రాల్చి తన
యొడలి గందమునకు సరియని తమకంబున యెదజల్లుచు తనయిచ్చ
గలతలంపౌడఁగూడ నేయుండని కాన వేల్పులకు (మొక్కుచు
నా సింగారంపు బెలఁ దోఁటలో పలువితంబులైన సొద్దెంబులు
తద్దయు ముద్దియ సూచుచు (గిమ్మురిల్లుచుండెనంత. ౮౩

తే. గీ. ఇటులఁదిరుఁగుచు కుబ్జయు ♦ నింతులపుడు
నలసిసొలసియును స్సుర ♦ టంచుచందు
రాఁదొగల్ జెక్కగద్దియ ♦ రానఁగలుఁగ
గూరుచుండిరి ♦ కమ్మని పైరవీవ ౮౪

తే. గీ. చెలుల మొగముల చెమ్మటల్ ♦ చెమ్మరించ
చెఱఁగులను బండుటాకుల ♦ జేతబట్టి
పోసఁగ బడలికఁబోవంగ ♦ విసరుకొనుచు
తియ్యనుడి కారమున నొక ♦ తెఱవఁబలికె. ౮౫

తే. గీ. వింటిరే మీరు మరునివా ♦ ల్గంటులార
యిచటఁగూర్చుండ మనకింక ♦ నిజుకుఁగలుఁగు
గానకమ్మని చల్లని ♦ గాలివీచు
కొలఁకులను జేరి నీరాడఁ ♦ గలుఁగులగ్గు. ౮౬

క. అనవిని మంచిదటంచును
ననఁబోఁడులు గుంపుఁగట్టి ♦ నంగుబ్జయుఁదా
జననిచ్చఁబూని తా మె
ల్లనిమాటల సాటిలేము ♦ లకునిట్లనియెన్. ౮౭

తే. గీ. జుట్టుపిట్టలు పొదరిండ్ల ♦ పట్టుఁజేరె
వెలుఁగు దొరరాల మెలకువ ♦ లొలికెవెచ్చ
వెలుఁగుచే బాటసారుల ♦ పొలుపుఁజారె
పట్టఁబవలాయె నిక్కాన ♦ మిట్టిపడును. ౮౮

క. వడగాలి రేగ నీడలు
కడుపొట్టివి యయ్యె ♦ పులుఁగుగమి చెట్టులపై
విడిదిఁగొనె నాగుబాములు
గొడవము నన్వాడిరోజు ♦ గొనిపవళించెన్. ౮౯

ఉ. పూపొద టెంకియా చెవుల ♦ పోతులు మిక్కిలి వేడియెండచే
దూఁపిలికాలు నాకెపస ♦ దున్నలు నీటిబిడారు పంకిలో
తేపకు తేపకుంబొరలె ♦ తెల్లమొకంబుల కూటువుల్లవిన్
గ్రైపుపగర్వు నొందె, బసఁ ♦ గాగొనెనంచలు తమ్మిజీబులన్. ౯౦

ఆ. కానయిట్టి తరిని ♦ కమ్మనిచల్లని
గాలివీచుచుండఁ ♦ గా కొలంకు
జేరితానమాఁడ ♦ దూరిబోవుసరమ
మంచిబలికితమ్మ ♦ మరునికొమ్మ. ౯౧

క. దిట్టరియీవగఁ బలికిన
కట్టడికిని హరుసమెల్లఁ ♦ గ్రమ్మంగనుబల్
రెట్టింప నవలలందొఱు
నట్టుంగొట్టక యెడఁదల ♦ నాణెము గలుగన్. ౯౨

తే. గీ. ఉండనొక్కతె యందులో ♦ నుండిలేచి
నాల్గుదెసలనుఁ గనుఁగలి ♦ పుల్గుగములు
లేచి వాలెడుచోటుల ♦ లింగనిమఱి
పొలఁతుకలనుఁ గనుంగొని ♦ పలుకుఁబలికె. ౯౩

చ. మగువల మిన్నలార విను ♦ మానము నా యొకతమ్మిసోల్మను
డుగమనికల్ వెలింగె సెగ ♦ చుంకును దానిసి చూచునంత జా
గుఁగొనుట కేల యింక మన ♦ కోయనఁ జేడియలొక్క పెట్టునన్
సుగము సెలంగికమ్మ విను ♦ చూలియువీవఁగ లేచిరంతటన్. ౯౫

ఆ. లేచి వేడ్కతోడ ♦ లేమ మేల్బంతులు
తూడుతింటినడల ♦ తో నొయార
ముప్పమల్లె మొల్ల ♦ తుప్పలఁబోదలచే
తనుఁ జెలంగుఁద్రోవ ♦ దమినినడచి. ౯౬

క. సరివాల్గంటులు నెదుటఁగ
నిరిమొద బాకిన్నెలంగ ♦ నెగడువిరాళిన్
దరఁగల తేటిరవాళిఁ
గెరలఁగ పుల్గులపిసాళి ♦ కేళాకూళిన్. ౯౭

చ. కనుఁగొనివేడ్కతోఁ గలువ ♦ కంటులు తీఁగమెఱుంగుబోడి వెం
టనుఁ జనికేకిసల్ జరచి ♦ డంబగు వేల్పులవాక నెల్లత
చ్చనమును సేయునంచు నెద ♦ సంబరమొప్పఁగ నొద్దపొంటినుం
డునవలతీవె జొంపముల ♦ డొంకుచు నందొకకొమ్మవాకొనెన్.

క. ఈ కెందామరల హారం
గీకలువలరోకు కదుర ♦ రహిన్ విసములసా
రీకమ్మఁగాలి రమణం
బీకొలనునఁగాక నేల ♦ నేకొలనున కా. ౯౮

(త ర ళ వృ త్త ము)

మొలను మేల్కయిదమ్మ లానుచు ♦ ముద్దరాండ్లాయొద్దునం
నిలచియచ్చోటఁ గలుఁగుచుండిన ♦ నీటిసొద్దెములప్పుడా
చెలువమిన్నకు విన్నవించి ప ♦ సిండియుంచెలు గల్మనన్
నెలకలంబని సేయుమెట్లను ♦ నెమ్మిఁగాఁ దిరుఁగాడుచున్. ౯౯

చ. తమతమ నీడలాదరిని ♦ దప్పకచూచుచు సాటివారలం
చు మొగములంజిరాగుఁబలు ♦ జొప్పడఁగచ్చకు కాలుద్రవ్వన
ట్లు మనసుఁగాంచి ముద్దులుపొ ♦ టుకుఁనకాలను నేలరాయునా
గమనిక వేరు చేడియలు ♦ గన్గొని చిర్నగుఁవ్విర త్తితిన్. ౧౦౦

తే. గీ. తేటిమొత్తంమ్ము బచువుచే ♦ నీటుఁదమ్మి
మొగడపై వ్రాలుమనఁదోఁచెఁ ♦ బిగువుఁగలుఁగు
బిత్తరియొకర్తె మగఁడు చ ♦ న్నొత్తులలిని
గనుపడియె కొమ్మవన్నె బం ♦ గారుబొమ్మ. ౧౦౧

తే. గీ. అసలుఁ బుట్టుఁగు మొగడపై ♦ పసఁజెలంగ
జమిలిముక్కాలి వ్రాలిన ♦ చందమెన్న
కొలఁకువలపు మిటారిమే ♦ ల్కులుకు గుబ్బ
దుగలగను పట్టుమొనలనఁ ♦ దోఁచెఁగనవె. ౧౦౨

చ. తొలకరిసూఁడు తెల్లనెద ♦ ద్రుక్కుచు మేలగుతమ్మితూండ్లకై
జలకములాన వ్రాలుచును ♦ సయ్యనలేచుచు సున్నపొల్పులీ
కొలఁకను తీఁగబోఁడికులు ♦ కుల్గలతెల్లని పూలబంతుల
ర్మలి చెరలాడెనో యనెఁడు ♦ మేరకనుంగొన వేనుడంతుకా. ౧౦౩

క. ఇట్టియొయ్యారములనుఁ గని
పెట్టుచు పిననగవులెగయ ♦ ప్రేముడిమదిలో
నట్టిపడ వెలఁదులందఱు
గట్టిన వెలిఁపట్టువలువ ♦ గమివిడచిమనక్. ౧౦౪

ఉ. సొమ్ములుఁ దీసిపెట్టిపడు ♦ చుల్మసచందురు కావిఘట్టముల్
నెమ్మదిఁగట్టి రొమ్ములకు ♦ నిండుగ చీరెచెఱంగు సొంపులు
న్నమ్మతిలం బిగించి పలు ♦ మారును కాసెలబూసి దొండొరుల్
తమ్ములఁ బోలుకైనికయి ♦ దంటఁగబూనుచు నొక్కపెట్టునన్.

చ. తిరుగుచు నొడ్డుపైని తమ ♦ తీరఁగు నీడలనీటు నీటిలోఁ
బరువడిఁజూచి చూచియు సె ♦ బాసని యీరసఁబూని జిఱ్ఱునన్
విరివిసిగల్లు తంతియల వీఁకను ♦ డిగ్గుచు సాటిరూపులున్
వెరఁగున మాయమౌనటు గు ♦ భెల్లని మ్రోతలుఁ బుట్టదూఁకినన్.

ఉ. దూఁకినతోడనే చెలులు ♦ తొంటి తెఱంగున మళ్ళిఁ దేలిమిం
న్వ్రాకను మేల మాడుచు జ ♦ వంబుననట్టిటు లీదువారు నీ
ర్వ్రేకిని లేచువారమఁగుఁ ♦ బట్టగ మున్గెడువారు కొల్కుచీ
కాఁకుగ నింగినంట జల ♦ కంబులు జల్లెడువారు నీతోగన్. ౧౦౭

క. హల్లాకొల్లారము జొ
త్తిల్లఁగ చేడియలుఁ దూఁకఁ ♦ దిరిఁగికొలఁకు బె
గ్గిల్లి ననుసరముఁచెట్టకు
డుల్లోయని మొరలిడెనన ♦ నొప్పెర వాళుల్. ౧౦౮

ఆ. తమ్మికమ్మనిరుఁ ♦ ద్రావుటచే మన
కాఱుకురులసాటి ♦ గాంచెనంచు
తుమ్మెదలనుఁ జోపు ♦ తొగబడంతులుగుట
తానమాడుచుండ ♦ దరులఁ దేరె. ౧౦౯

క. పేరిమి రాయంచలు నొ
య్యారుల నడచక్కదనము ♦ హొయిఁగగని ప
ల్మారుమనను వారలుఁగని
కేరుదురని నింగిఁ జేరి ♦ కిసమసఁబడియెన్. ౧౧౦

చ. చెలువల మోము తామరల ♦ చెల్వముతో సరిరాకపోవుటీ
బలిసిన తేంట్లుఁ దేనెఁగొనఁ ♦ బంటులమైతిమి వీటి బాయుపెం
పలరెదమంచు వీడిమఱి ♦ హాసులఁజూచిన వెల్తియయ్యె నే
లలఁబడుతీరు మేటియల ♦ లండలమున్కలు వ్రాలెనూగుచున్.

క. నీరున పొలఁతియొకతెయు
య్యారమున న్మునిగికొంత ♦ హాదనునలేవన్
బేరిమిసవ్వపు చెలులన్
జేరిచెలిమి సేయఁబోవు ♦ చెలువుగను పడెన్. ౧౧౨

క. బిత్తరమగు హాయిన్మంజీ
ముత్తియముల చేర్లువ్రేలు ♦ బుర్రటకొమ్మల్
బిత్తరులుఁదాల్చి యిరుఁదెస
లొత్తుఁగ నీరాఁడిరచట ♦ హొయలుఁ జెలంగన్. ౧౧౩

ఉ. కొట్టముచొప్పు నన్వెలఁది ♦ కూటువులెల్లనుఁగూడి నీరుచ
న్మెట్టులఁ దట్టనిల్చియెడ ♦ మేలని చిమ్మనఁ గ్రోవికేలునన్
బట్టివిసంబు బీర్చి గరు ♦ వంబును దొట్రిలచిమ్మతుంపరల్
బుట్టఁగనూది జల్లిరట ♦ మోములగుబ్బలపై దలిర్పఁగన్. ౧౧౪

చ. సరగున మోముచందురుని ♦ చాయలు కన్నులకిమ్మ జంటపై
బరివిన మోసమౌననుచు ♦ బల్మరుమోమును మామకల్లటన్
విరివిఁగనీయ బూనెనన ♦ వేఁగనులం జెవులంముఁకంది బి
త్తరముగమూసి యొక్కచెలి ♦ తమ్మికొలంకున మున్గెగ్రక్కునన్.

క. జలకంబులోన కొందరు
వెలికిలబడి నీదుచుండ ♦ వీఁకనుఁగాళ్ళన్
బలుమరు లేపఁగవేల్పుల
చెలువలపై కాలుద్రవ్వ ♦ చెలువుం దోచెన్. ౧౧౬

చ. వెలికిల నీటనీదగను ♦ వింతగ గుబ్బలుఁదమ్మి మొగ్గలం
చలరుచు నంచకూటువలు ♦ హాయిదలిర్పగ రాగకల్కివే
దలకుచు బోరఁగిల్లఁబడ ♦ దారగు కావిరి కొప్పు గాంచి పిం
పలరెడుమబ్బు లంచెడఁగ ♦ నర్మిలిఁబోవిడి పారెనల్దెసల్.

సీ. ఏనుఁగు నడయొఱ్ఱ ♦ మొగవుతనమ్ముల
తులఁదూఁగు తమ్ములఁ ♦ దునిమివేసె
సంపెఁగ గందియు ♦ నింపొందు కొదమల
తుమ్మెద బారులఁ ♦ ద్రుళ్ళఁజేసె
దోరంపు జిగిమొగు ♦ ల్లురుముగల్గిన నాతి
రాయంచలను బల్ప ♦ గాకుపరచె
మాము మోమోర్తుక ♦ మక్కువఁ బోనాడి
జక్కవపక్కుల ♦ స్రుక్కఁజేసె

గీ. నిత్తెరంగునఁ దిరుగుచు ♦ చిత్తరముగ
తమ్మికంటులు తేటివి ♦ తంపుకురుల
చెలువమిన్నలు నంచయా ♦ నలునుజక్క
వదుగగుబ్బెతలీది ర ♦ బ్రమ్మ దోప. ౧౧౮

చ. కలుకుఁబ మోముదమ్ములను ♦ కస్తురివన్నునుఁబూసి నీటిలో
వలఁగడుఁ దోఁగితామరల ♦ బల్మొసచేతులఁబట్టి యొడ్డునం
దలరుచునేగుఁ దెంచియొ ♦ మానులు సంద్రపుగట్టుకెక్కి మునుం
గలిమినెలంత దమ్ములను ♦ క్కైఁగవఁదాలిచి వచ్చుపోలికన్. ౧౧౯

క. అదిగో లెకమ్మఁ గాడుపు
లోదవినమై మెఱుఁగులీన ♦ సువిదలమిన్నల్
ప్రిదులునసతీవె జొంపపు
చదురున వనిసేయు చలువ ♦ చప్పములోనన్. ౧౨౦

క. ఈరూపున చెలులందఱు
జేరినకుబ్జకును పనులుఁ ♦ జేసెను చేడెల్
తోరంపు తొడవులును జ
ల్తారు చెఱఁగుచీరఁదెచ్చి ♦ తాలిమినంతన్. ౧౨౧

తే. గీ. తపసికన్నాపరేవను ♦ దారుమీఱు
నిగ్గుఁకలకాఱు జొబ్బిలు ♦ నీటిచాగి
కప్పికురిసెడు వితము మొ ♦ గులునఁ జాల
తడికురులవెంట జలకము ♦ దవిలిఁజారె. ౧౨౨

తే. గీ. కారుమ్రబ్బును నెగ్గాడు ♦ కారుకురుల
నొక్కచెలివచ్చి తడియొత్తి ♦ చిక్కులెడల
దీసిమల్లియుకడినూనె ♦ తిరుఁగబెట్టి
తొలుతఁదాల్చిన చంద్రకా ♦ వుల సడల్చి. ౧౨౩

క. జలుతారు చెఱఁగుపసజొ
బ్బిల తెల్లనిపట్టుచీరె ♦ పిడికెడుమేరం
గలకొనున బలుకుచ్చి
ళ్ళలరఁగమైఁ దాల్పఁజేసి ♦ రతివలమన్నల్. ౧౨౪

తే. గీ. గుబ్బలుల మేటినిబ్బర ♦ మబ్బయనెఁడు
గబ్బిగుబ్బల జంటపై ♦ కారుజిలుఁగు
మొగ్గవనిఁజేసి కెంపులఁ ♦ బొసఁగఁగూర్చు
ఱైకచెలువారఁ చెలువ బి ♦ ఱానఁ దొడఁగె. ౧౨౫

సీ. చిన్నిచందురు మామ ♦ చెన్నగుమోమున
చేర్చుక్కఁ బొట్టొగి ♦ చిందులాడ
నెమ్మది చెవులకు ♦ కమ్మపౌఁజులనిగ్గు
చెక్కుటద్దంబుల ♦ చెమ్మఁగిలఁగ
నక్కన రతనాలుఁ ♦ జెక్కిన పతకముల్
వరఁగలించెడు బన్న ♦ సరులుగదుర
తెఱవాయ మొకమునుఁ ♦ దెగడు మెల్నడుమున
బిల్లల మొలకట్టు ♦ బిగువుమెరయ

గీ. తళుకు చేకట్లు సందిటి ♦ తాయెతులును
కేలుదమ్ముల డాల్మిగ ♦ రాలముద్దు
టుంగరంబులు బదివేళ్ళ ♦ నొప్పకాళ్ళ
గజ్జెలందెలు మట్టెలు ♦ గల్లుమనఁగ. ౧౨౬

తే. గీ. తొమ్మిదివితంబులునుఁ గల్గి ♦ తోరమైన
రవలఁగూరిచి పనిసేయ ♦ రంగులెనఁగు
ముక్కెరబులాకి నత్తును ♦ ముఱిపెమునను
నూవుఁబూఁబోలు ముక్కున ♦ తేవఁబెట్టి. ౧౨౭

క. ఈసొరున నాకుబ్జకు
కై సేసి యొయారులట్టి ♦ కారున తాము
ట్లానాటిఁ జెలఁగివారల
బోసనములుఁ దెసలఁబర్వ ♦ పొలతుఁలు పిలుచన్. ౧౨౮

ఉ. చీటికిమాటికి న్వలపు ♦ చెమ్మగిలందగు గాలివీవ పెం
దోఁటకురాశమందు వసఁ ♦ దొట్రిల మేటికలున్నగద్దెపై
చీటకమొప్పఁగ న్రవలఁజెక్కిన ♦ వన్నె వసిండిసింగపుం
బీటకుదిర్చి పైనిసరవింగడు ♦ గుబ్జపడంతి కూర్చొనెన్. ౧౨౯

క. మలపగతురాణి వేల్పుల
కలుకులుఁ గూర్చున్నకొలువు ♦ గమనికకుబ్జన్
గొలచియు గూర్చొనిరచ్చట
దలిరాకుం బోఁడులెల్ల ♦ దనుకులుఁ దొలఁగన్. ౧౩౦

మ. పిదపన్ గుబ్జపడంతి నివ్వెఱఁగునన్ ♦ బెంపొందు చీకాఁకు నె
ద్దఁదలిర్పంగ న్ననవిల్తుడార్చుచును కో ♦ లంగూర్ప మంద్రాడమున్
గుదురై మేన్పొనుకాడుదూపటిలి ♦ స్రుక్కుం జెందియున్ బట్టునుం
వదులంగన్నులవెంట నీర్వరదలై ♦ పారంగనొక్కుమ్మడిన్. ౧౩౧

క. ఇరుగడలనున్న సోబతు
　గరితలగను రెప్పలార్ప ♦ కనుగన్గొని యీ
　విరిహాదనుఁ దోఁటలోఁ ద్రి
　మ్మరఁగను వెఱవేఁకిబుట్టె ♦ మఱి నేమగునో.　౧౩౨

క. వలనాటుకోనెనుఁ గడునా
　వలనా యూకాఁకనీరు ♦ వామినియీాదన్
　గలనా నాచేరువనుం
　గలనాఁతుక మానికములుఁ ♦ గావరెనన్నుఁగ.　౧౩౩

క. అని తియ్యనిమాటాడన్
　గను నేస్తపు చెలులలోనఁ ♦ గన్నాకగుప
　ద్మిని నాఁబేరటిచేడియ
　వినియూరకయున్న బిలిచి ♦ వివరించ నొగిన్.　౧౩౪

క. తలఁపున కలవరమెల్లం
　దులదూఁగెను వెన్నపాల ♦ దొంగకు నాపై
　చెలిమిఁ గలుఁగఁజేసియు నా
　యిలుఁ జేరందోడితెమ్మ ♦ యేననుమాటల్.　౧౩౫

క. వినుమావిని వైళముగన్
　జనుమాజని యల్లవాని ♦ సరిసంగడమున్
　గనుమాగని నావేంద్రము
　లనుమాయని తోడితెమ్మ ♦ యంకముఁ దొలఁగన్.　౧౩౬

చ. అని చెలియింక కొన్నిటి రెయి ♦ యూరికిఁ జెప్పినవీనులారఁగా
　విని తనబుద్ధిలోన బలు ♦ వింతలు సంతసముల్లసిల్లఁగఁ
　దనవిని నేయు మాటలవి ♦ తంబునకుం జిరునవ్వు చెక్కు జం
　టను హావళింప చక్కెరకు ♦ తావగుమాటలుఁ బల్కెవేడుకన్.

శా. అక్కా విన్ గనుఱెప్పపాటుఁ దరిలో ♦ నై పోవనుల్లాదెనీ
విశ్కాఁ కల్గొను ఱేల నమ్మమడి ♦ నిప్డే నేగి నీచైదముల్
నిక్కంబెంతటఁదీర్తు నమ్మికలతో ♦ నీవిల్లు చేరంగఁబో
దక్కింతున్ గతివేల్పునీకు ననవి ♦ ల్దారింగ వాళింపుచున్. ౧౩౮

క. అక్కరో యూతనిరవలం
జెక్కినమంచమున పూలఁ ♦ జేరుపఁదగు నీ
ప్రక్కవరుండఁగ బెట్టిన
చక్కెరవిలుతుండు ని ♦ న్గొసరి బానిసెయా. ౧౩౯

క. ననతీవెఁ బోఁడియా వై
వనియూరడిలంగ బలికి ♦ హోళిమొసంగన్
దనుఁబోవ కట్టడంగొని
జనె గరుటామంతుకాతు ♦ చక్కనితలకున్. ౧౪౦

ఉ. నాఁవిని నేలతేమరము ♦ ణన్నది తామరవిప్పనిట్లనెన్
తీవమెఱుంగుఁ బోఁడిజన ♦ దేవెరి యేమననుండెనోయిలున్
బోవఁగఁదల్చెనో యటకుఁ ♦ బోయిన చేడియవచ్చుదాఁకసా
పూవులఁ దోఁటలోపలకు ♦ బూనెనొకన్నయమీఁది బాళిచే.

క. ఆకతలవితము లెల్లను
జోకలుఁ జెలువారఁజెవుల ♦ జొరఁగనునాకుం
వీఁకఁగొని తేటతెల్లమి
వాకుల వివరింపుమయ్య ♦ వదలనిరాణన్ ౧౪౨

సు గం ధీ వృ త్త ము

కారుసీటి చాగిమంచు ♦ కార్వొరంగు చూపరీ
పోరుతిండి మిత్తిగొంగ ♦ ప్రొద్దుచూలిబమ్మలున్
నీరువామిఁజేరి కేలు ♦ నెత్తిఁజేర్చి మ్రొక్కఁగా
గారవించి ప్రోచుమేటి ♦ గట్టుఁదాల్పువేలుపా. ౧౪౩

మ. కుతిసీవీణము జిల్గురింగులనిగల్ ♦ గోరాడమూతాబి సా
ల్వాతమింగప్పి పులుంగుతేని బుజలన్ ♦ లావొప్పఁగూర్చుండితే
కతెగన్ గావఁగముజ్జగంబులు వెలుం ♦ గన్నారి గావించు మే
ల్రతనాల్గూర్చిన వేల్పుగొండ నెలవై ♦ రాణించు కార్వేలుపా.

(గద్యం)

ఇది శ్రీమద్రఘూంగనాంగ మందారలతోత్తుంగ స్త న స్తబకస్థిత
శృంగార భృంగాయమానలక్ష్మీ నృసింహకృపాలబ్ధ వాగ్వి
భవ భగవద్భాగవతార్చనాతత్పర చతుర్విధ కవితా
పరిబంధ నిర్మాణచాతుర్యధురీణ ఆంధ్రభాషా
ప్రవీణ హారితసగోత్ర పవిత్ర రంగాచార్య
పుత్ర నల్లంతిఘుల్ చక్రవర్తుల రంయ్యాల
లక్ష్మీనృసింహార్య కవినాధ ప్రణీతం
బైన అచ్చతెనుఁగు కుబ్జాకృష్ణ
విలాసంబను సింగార కబ్బం
బునందు ద్వితీయా
శ్వాసము

శ్రీ

శ్రీమతే రామానుజాయ నమః

( శ్రీలక్ష్మీనృసింహ పరబ్రహ్మణే నమః )

శ్రీ విష్వక్సేనాయనమః॥

# అచ్చ తెనుఁగు కుబ్జాకృష్ణవిలాసము

## ( తృతీయాశ్వాసము )

క. సిరిచాన మేనుతీవను
విరియు చనులవ్రాలగుత్తి ♦ విడిముట్టుగుతే
టిరహిన్వేలువు గొండను
మరిగిన రక్కసులగొంగ ♦ మానిసి సింగా. ౧

వ. ఆలకింపుము. ౨

క. అనితపసి కజ్జిమనుమం
డునుఁ బల్కినపల్కులకు పొ ♦ టుక్కున బుద్ధిం
బొనుకాడెడు వారుసంబున
వినిచినఁగు చెక్కులొత్త ♦ వినుపించె తగన్. ౩

తే. గీ. అటులఁబద్మిని నాచెలి ♦ యలరువిల్తు
డున్నపట్నముఁ జేరంగ ♦ తెన్నునడచె
నంతగాములతేను త్తా ♦ వింతవెనుక
దెసనుఁగలకొండపై వ్రాలై ♦ తిరముగల్గి. ౪

ఉ. ఆ మసఁబోయినాక చెలి ♦ యూరెము నన్వలవంతమీఱి పెన్
బాములనొందుచుండఁగ సె ♦ బాసలి క్రొన్ననవిల్తు దొడ్డగా
నామనిచందమామ సుర ♦ లచ్చటఁగొల్వఁగ గొల్వునుండిగా
రాముని బల్మిమందరకు ♦ గ్రమ్మన నేమనఁజేసె చెయ్వులన్. ౫

ఉ. చేసినతోడనే వెడలె ♦ చెంగవవిందును గాలిఁబూవటీన్
వేసపిఁగుల్కనుంచి విరి ♦ విల్లునుగేలను దాల్చి వేటకా
వేసముఁబూని మ్రాకులను ♦ వింతగుమాటును బొంచిపొంచి సం
తోసమెలర్ప గన్గొనెను త్రో ♦ వను బెగ్గిలులేడికంటిఁదాన్. ౬

క. కనుగొని గోర్వంకల వే
గున కన్నియయూర మొప్పఁ ♦ గోగిలగమిజ
ట్టును ముట్టనిలిపి నేనా
మనిచాల్పుగనునిచి వేఁడ్క ♦ మదిఁజిల్కతోగన్. ౭

క. ఉసిగొలిపి పిదపననవి
ల్లెనఁగఁగ పూవాలుఁగూర్చి ♦ యీరెముపూటుం
పసిఁగఁగొని చనులనడుమను
కసిదీరఁగ ములయనేసె ♦ కాతాళముగన్. ౮

వ. ఇట్లేసిన కనలి యురువడించిన నబ్బలగంబును. ౯

చ. కనితలపోసి కొంతవడి ♦ కన్నులరెండిటనుండి వచ్చునీ
ర్చనుగవ కొప్రమందు బడి ♦ జారఁగకుందుచు గువ్వగుత్తికన్
వినుఁదువెలందులార నన ♦ విల్తుఁడునున్నతూపులేసె క్ర
న్ననపులుకాఁసి పుల్గులుక ♦ నారిలిబల్కులు బల్కె వెండియున్.

ఉ. మ్రోసెను తేటిమొత్తములు ♦ ముజ్జగమందున తేజువెన్నెలం
గాసెను చందురుండు చలి ♦ క్రమ్మనిపయ్యెద తావిముల్కలన్
వేసెను గండుకోయలలు ♦ వీన్దొసలెల్లను నిండునట్లుగా
కూసెనికేగ తిన్మరుల ♦ కున్మదినోరుతు నేమసేయుదున్. ౧౧

క. అనితనను దెప్పరములం
దనునేసెడు తేఁటిరాయ ♦ తమ్మనుగోర్వం
కనుతలిరు మెపరినినిం
పున సమతంబెట్టఁ దలచి ♦ పొలఁతుక యనియెన్. ౧౨

ఉ. తేఁటివలంతులార పువుదేనియ ♦ లంగడుఁద్రావిత్రావి మా
తోఁటిపసందు మీరఁబలుత్రోవలఁ ♦ బోవక నొక్క తీరు మో
మాటము లెంచియుండు డది ♦ మంచిది యిప్పుడు లేక పోయినన్
జాటెద మమ్మెదిర్చినను సంపెఁగి ♦ గందులమంచు మెప్పుగన్. ౧౩

చ. పరితములార మీకనుల ♦ బల్కినుకల్ గిలగొట్టుచుండనన్
సరమలఁబెట్టనేల నరు ♦ సంబున మామిడిమోకగుడ్చి చె
చ్చెర నొకకుత్తుకన్ గలసి ♦ చెల్మినిసేయక వాదులాడగన్
నరివడ దెట్టివారికిని ♦ చక్కగదిగ్గడు లేమలెన్నఁగన్. ౧౪

చ. చదువుల పక్కలార మనఁజ ♦ క్కెర తేనియఁ బాలఁగ్రోలి బె
ట్టిదమెసలార మీమెఱవ ♦ డిన్వెసఁజూపుచు నుండనేల నే
నెద బెదరింతయైన గొన ♦ నేగుడు నిప్వెఱనొందనాదులఁ
చదురులమంచు నిక్కెదరు ♦ చాలఁగనేర్పడె మీదునేర్పులున్.

గీ. కొమ్మగమినెక్కి దిరిఁగాడి ♦ కొమ్మగముల
సరములనుఁ బెట్టనాయమూ ♦ సరవినెళవు
జెఱుచువార లటంచు నా ♦ నెఱికిఁదెలిసె
నరయజవ్వాది గందిన ♦ టంచుగనుడి. ౧౬

క. అనియెగ్గాడెడు తోయము
ననుగందపు కసుమయుందు ♦ ననుదిరువుచు చ
ల్లన కమ్మనగొని పయ్యెర
తనమేనట గ్రందుకొనగఁ ♦ దరుముచ్చు బలికెన్. ౧౭

క. మునువేల్పు టొడయఁడును నే
ర్పున నింతటివాఁడవనుచు ♦ బోసికనునిన్
దునుకలు మూఁటిని నాల్గిం
టినిఁ జేయుటవలనఁ జగము ♦ శివిగఁ గుంజెన్. ౧౮

తే. గీ. క్రమము జవాదికడిని బు ♦ క్కాముదోఁది
ముంపుచో నిన్ను నేమన్న ♦ బుద్దిని సర
సంబు గొనవికగాలిపి ♦ సాసియున్న
క్రైపుసామితనికమిక ♦ గాలిగీలి. ౧౯

తే. గీ. ఔర మును బొమ్మ నీదు పోం ♦ గారఁజూచి
యొకరికొక్కరుఁ గలువక ♦ నుండునటుల
మూలకును వేసెఁగావున ♦ ముజ్జగంబు
లలరెలేకున్న ముంచెద ♦ రక్కటకట. ౨౦

తే. గీ. అంటగిట్టని వేల్పుతో ♦ నరయనేస్త
మాటవల్లను నిక్కువ ♦ మతనిగొనము
పైరనీకబ్బె నాబలా ♦ వతిపిరికిని
నట్టువనుమాటఁ బోనాడ ♦ నాయమేర. ౨౧

ఉ. చట్టనవీనుల న్వినుము ♦ సారెకు సారెకు కన్నెనందులో
దిట్టరిన న్నెముం బునెము ♦ తీరు లెఱుంగను నేనుఁట్టినన్
వట్టిదిగాదు నానుడువు ♦ వాలఁగునంచు దిటమ్ము నమ్మునీ
బెట్టిదమేల కాఱులను ♦ బ్రేలెద చయ్యనకమ్మ కర్వలీ. ౨౨

మత్తకోకిలావృత్తము

రాకురాకు మటంచు నిన్నప ♦ రాకుఁ జేయుచు వేడినన్
వీఁకగందపుతావి బూనియు ♦ వీచగానిది బాగె మ
నోక్కకుఁ గోరనుఁదీయఁ బోపని ♦ గొడ్డలింగొన నెందుకో
సోకుదయ్య మటంచు బల్కెడు ♦ జోలినిక్కువ మయ్యరా. ౨౩

క. విను నిలుకడ గోరంతై
ననులేకయె విర్వ్వలాడ ♦ నాయంబౌరా
పెనుసుళ్ల మునుఁగుదువు నర
యను కనుపడనట్టిబూతి ♦ నై పోదువురా. ౨౪

తే. గీ. ఎంత వేడినఁ గాని నీ ♦ కింతయైన
కనికరముఁ గల్గదాయె ని ♦ క్కముగ నీదు
క్రొవ్వునణఁగింతుఁ దెలియు నే ♦ కొండవంటి
కటికపుంజనుగవగల్గు ♦ కన్నెకనుర. ౨౫

ఉ. గోరము లందజాలనిది ♦ గోకను సుక్కితి నూరకుండుమా
పైర బలీయదల్చకుము ♦ బాములు బాములబెట్టి నిన్నుక
డ్పారమెసంగుగాక చెలు ♦ వారెడు నీవడియొప్పు కారుపా
లౌరసరానరిన్నెరయు ♦ నారడిఁబెట్టక మిన్నకుండురా. ౨౬

క. అని ఝటుల నాలిగాలిం
గినుకారఁగ దూఱి పైడి ♦ కీల్బొమ్మమసఁ
గొని మరలఁదిరిగి బుద్ధిని
కనికరమూరంగ పొగడ ♦ గాఁ జొచ్చె వెసన్. ౨౭

తే. గీ. పాపగమితేని గెలిచియు ♦ పసిడికొండ
కొప్పారము నీరువామిని ♦ కూలదీయు
నట్టిమగటిమిఁ గలుఁగఁగ ♦ నలరిజగము
నిండువయ్యారతమి బెట్ట ♦ కుంకు నన్ను. ౨౮

వ. అంత నమ్మగువ వగనెగడనెగులున నిగపునట్టువను బొగడుచున్న
తోయంబున. ౨౯

క. చల్లని తెల్లనివెలుఁగుల
నుల్లసమాడగను కలువ ♦ నోడయుఁడు చదలన్

బల్లిదుఁడై తిరుగుచు వెద
జల్లెడు కాఁకలకు నదలి ♦ నయ్యనబలికెఁ.　　　　౩౦

తే. గీ. మున్ను తనతెంకిఁ గూలఁగ ♦ నిన్ను బుట్ట
జేసెఁ జేసెను పోఁబొమ్మ ♦ చెనఁటినుంచ
తగదనచు చంపకయె నెల్ల ♦ తరుణమందు
బ్రతికియుండఁగ జేసె ♦ నెప్పటికి నకట.　　　　౩౧

శా. బెట్రేకెత్తఁగ వేల్పుటొజ్జచెలువన్ ♦ వేఁగూడు దోసంబులు
న్గాట్రేనింగడు దయ్యమంచనక పీ ♦ కన్నెత్తి చేర్మాడుగల్
దొట్రిల్లం జెలువంబు లూడినలుపెం ♦ తోఁబుట్టి నీ డెందముం
జట్రాతిందగ నేయమేలగునె చా ♦ ల్చాలిట్టి సిగ్గించుమా.　　　　౩౨

క. పులుఁగులు వేల్పులు నీపా
లుల వెసమొసవంగ తునుక ♦ లుం జేసిన నీ
కలిమి సెడి నీల్గవే మొగో
తొలిఁజేసిన బాగమునను ♦ దోడి బ్రతికితివా.　　　　౩౩

తే. గీ. కన్నెమిన్నలనే చెడు ♦ కావలంబు
లంటగిట్టని వేల్పుపై ♦ యూరనిచ్చ
జేరికాల్చిన నలుపయ్యె ♦ చెలఁగిపజలు
మట్టియుట్టను మాటలు ♦ వెట్టెఁగదుర.　　　　౩౪

తే. గీ. కొసరుతో బుట్టువింటికిఁ ♦ గోడుఁగూర్చు
నటుల గోడును నాయెద ♦ నంటనేయ
చందమామనుమిప్పుడు ♦ చందమామ
తొగలవెత బాపినటుల నా ♦ తొగలఁబాపు.　　　　౩౫

సీ. నిక్కమాదప్పుదు ♦ నీయెదమసిఁగాను
　　నినునింగి సిగబట్టి ♦ నేలఁజరువ

నిన్నుపక్కలఁగని ♦ నెఱినెఱితిని పోను
నీపాలు లింతింత ♦ నిచ్చెతరుఁగ
చవితినిన్గను పజ ♦ సంతుల పాల్గాను
పరఁగవున్నములందు ♦ పాముగరుప
నీమేనయల్లుని నీటుమై ♦ గాలిపోన్
నిన్గన్న కడ్పుబ్టె ♦ నీరుగాను

గీ. ఓరియొజ్జలరాణితోఁ ♦ జేరిమరుని
పోరుఁదీర్చిన నడిదోన ♦ కారి నిన్ను
నంటకావల మెల్లను ♦ నంటుగావ
నేను తలవంచెదను జూడ ♦ నిన్నుమాను. ౩౬

క. అంచీవరుసున కినుకన్
మించగఁ బోనాఁడితాలి ♦ మింగుండియలో
కొంచెముఁ బూనియు పొగడెద
మంచి నుడువుగమిని నంచు ♦ మడఁతి గునుపుఁగన్. ౩౭

ఉ. ముమ్మొనవాలుదారి తల ♦ బొల్పగు బంగరుమేటి కుళ్ళవె
తంమ్ములగొంగవై కలువదాటుల ♦ పెన్వగ బాపుచుండివిన్
దిమ్మరులున్నబాసనఁగ ♦ దిర్వుచు ముజ్జగముల్వెలుంగు చో
మమ్మతిలంగ గాచియును ♦ మమ్ముల ద్రిమ్మట బెట్టకుండుమా.

క. అనిఁబొగడు చుండుతఱిలో
ననవిల్తుఁడు కేరివింట ♦ ననలల కోరుల్
బెనువడఁగూరిచి చెలియ
కున్నకును కను ♦ జూపులలరఁ గొనకొని వేయన్. ౩౮

ఉ. వేసిన వేలుతోడ వెర ♦ వేఁకియొడం గడుబుట్టుచుండ తా
గాసిలి యొక్కచేడె చనుఁ ♦ గట్టులపట్టు నవేఁ బరుండి సె

బాసుర తొల్లి కాటిదారి ♦ పాలిట నీజవ యేడఁదాగె ని
ట్లీసుల ముద్దరాలివయి ♦ నేయఁగ నాయమయించువిల్తుడా. ౮౦

తే. గీ. నీలకొరులవలపులు ♦ నిలువలేక
బమ్మకతెవేల్పు కాఁబోటు ♦ తిమ్మగలుఁగ
నోటయెద మేన తమతమ ♦ బోటిరతన
ములనుదాల్చిరి మే మెంత ♦ పోటుకాఁడ. ౮౧

చ. దుగినుడు నీదు బెట్టిదపు ♦ త్రోవలుఁ బోకడఁజూచి యోటి నా
లుగవిము పూవులైన యెద ♦ లోబడకన్ గనువంబెసంగఁగా
నెగులు కొనంగఁజేసితివి ♦ నీకవిగాటపు తూపులిచ్చినన్
జగములఁగాల్చవే వలపు ♦ సామినతంబు తలంపునేసినన్. ౮౨

క. ఓరీ నీవలెబంటులు
లేరో నీవాకడవాకొ్క ♦ లేకున్నను విల్
దారిలి యిటు మిడిసిపడకే
మేరటరా చెలుల నా యు ♦ మేరానేచకే. ౮౩

ఉ. నెయ్యపుతేఁడ నీకు జత ♦ నెవ్వరి పోటరికాఁడు లేడటం
చొయ్యన బెట్టిదంబుఁగొన ♦ నోర్తురె పెద్దలు నేరికైన మేల్
చెయ్యఁగ మంచిదంచు మఱి ♦ జెప్పిరి చెన్నఁటిమామఁగూడి యా
కయ్యముఁ జేయవచ్చెదవు ♦ గాయిలుఁజేరగబొమ్మ జఱ్రునన్. ౮౪

చ. చిలుకహుమాయి ♦ చక్కెరల సింగిడి తేటులనారి కమ్మపు
వ్వులు ములుకుల్దలంపగను ♦ పూదఱి కమ్మనిగాలి నిండు వె
న్నెలదారి వెంబడింపవల ♦ నెయ్యుడ నీయెదగూడి తుల్వలై
కలువరమందఁజేసిరి వ ♦ కావకలుంగలుగంగ నిత్తరిన్. ౮౫

సీ. అక్కున తెల్లని ♦ యలరు సోగులుఁగావు
సొరది సప్పంబుల ♦ సోగులివిర

నాదుజడజూపి నీమోము ♦ నక్కు నీ ద
ళాయఁడగు గాలి వినుఁజేరు ♦ నాచనుఁగన. ౫౦

క. ఎన్నన్నో నుడివినను నీ
కున్నన రెడ నేలబుట్టు ♦ కుంకు టదేమో
కన్నునుఁ దట్టినఁ దప్పదు
వన్నియ నీమేను సిరు ♦ వలె నారోరీ. ౫౧

వ. అని యిట్లు కినుకాఁదూఁటి యక్కటికమూని చొక్కఁపుమాటల
వక్కాణింపుచు నిట్లనియె. ౫౨

క. జగముఁ గలిగించు బొమ్మకు
నొగి తమ్ముఁడవయ్యు నల్ల ♦ యొడలిదొరకు మే
లగు కొడుకవయ్యు నీము
జ్జగముల వలవంచఁ జేయు ♦ జాణవుఁగదరా. ౫౩

తే. గీ. అన్నిటుల బొగడినఁ గాని ♦ యంతకంత
కలరి వలపులరాయఁడు ♦ కలువతేడు
కాఁకలనుఁ బెట్ట వెఱగంది ♦ కనికరమున
చెంతకుండెడినే స్తవు ♦ చెలికి ననియె. ౫౪

ఉ. వాలుగడాలు ఘాతకుఁడు ♦ వాలెము నాదిదు తేటి మూకకున్
వేలుపు బువ్వ కాఁకకును ♦ పీవలిరాకకు సారె రేకకున్
బూఁబడారు జోకకును ♦ పొల్పుఁగు జిల్కల నోముకూకకుం
బోలమించి కాఁక తులఁదూఁగెను నే నెటులోర్తునే యిటన్.

క. హెచ్చరికఁ గాలి వీచెను
నచ్చలమున మరుఁడు నేచె ♦ నాకసమున చం
దెచ్చి చెలరేఁగె గాము
చ్చిచ్చొగినిటఁ గూడెనేమి ♦ సేయుదు చెలువా. ౫౬

వ. ఇట్లు మతకరి వేల్పుఁగూఁతు తన కనుంగవకుఁ దోఁచి మఱియు చెలువ కిట్లనియె. ౫౭

క. నిక్కి చనుఁగంటలుబ్బ ప
టక్కున లలి తైకపికిలె ♦ ఠవఠవరింగుల్
స్రుక్కనల కొప్పుఁజారెను
గ్రక్కసమున పోకముడి బి ♦ రానను వీడెన్. ౫౮

ఆ. వె. అనుచు కళ్కియుల్కి ♦ వినఁబల్కె చెలికి తా
తావిపూవులలరు ♦ తీవెయింట
పట్టుపాన్పుపైన ♦ పట్టుదప్పిన కీలు
బొమ్మవగిది వ్రాలె ♦ పొంకముడిగి. ౫౯

ఉ. వ్రాలినతోడనే చెలులు ♦ వారనిప్రేముడి మేరటిల్లఁగా
పూఁ సురంటి వీచుచును ♦ పువ్వులు కస్తురి కప్పురంబు మే
ల్గాలిలు జవాదిమైనలఁది ♦ క్రన్నగకొంతనుఁ బోవఁజేయు మేల్
నీలిసిగల్ మనన్వలప ♦ నింగడు నేసిన కుబ్జచేడియున్. ౬౦

క. కనుగవ విప్పుచు నల్గడ
లనుగన్గొని మైవడంక ♦ లంపటమున మో
మున చెమట చెమ్మరింపఁగ
దనసకులనుఁ జీరి మఱి వి ♦ తాకునుఁ జెందెన్. ౬౧

వ. జెందిన నమ్మలక్కలొక్క చక్కటి కేతెంచి చిక్కుబడియున్న యక్కొమ్మం జూచి చెక్కుచెదరి యొక్కరొక్క రొక్కరొక్కరి మొగంబులం జూచుచున్నంత నొక్క టక్కులాడి యక్కలికి గ్రక్కతిల్ల మొక్కచెడిన తోడిజోటులతో నామాట పాటించు డని యిట్లనియె. ౬౨

ఆ. వె. అలమటించనేల ♦ యతివలు వినుడీ యీ
చెలువ చెలువ మలరు లలరుఁదోఁట

లోఁన ద్రిమ్మరిల్లఁ • గా నింతఁగల్గెపో
దీని కేమి వితము • తెలియఁగలరో. ౧౩

వ. అనిన నొక్క మచ్చకంటి నెచ్చెలులతో నిట్లనియె. ౧౪

క. ఓసకియలార యుడవిపి
సాసి చెలియమేను సోకె • సరికన్నయ్యన్
వేసదివి బొట్టుఁ బెట్టిన
నాఁ సరియన నిచ్చపడిరి • నాతిరతనముల్. ౧౫

వ. ఈతీరునఁ బొట్టుఁబెట్టి తెలివిడిసేసిన లేవకున్న నొక్కచాన జాణ
గాన జాణలగు లతకూనల కందఱి కిట్లనియె. ౧౬.

క. పుం డొకటి యున్న మం దొక
టిండాలుగఁ బెట్టినన్న • తేవను నవలా
కుందువెత యొకటి మన మిట
నిండారఁగఁజేయు టొకటి • నీతకములచే. ౧౭

ఉ. హెగ్గడికత్తె లప్డు వల • పెచ్చిన కుబ్జనుఁ జూచి జంకునన్
దిగ్గనలేచి మంతనము • తెల్పెడికట్టె మఱి లేవనెత్తుచున్
బిగ్గఁగ కౌఁగిలించి విరి • వింగల చెక్కులచేత నంటి సీ
యెగ్గతమాడువక్కణము • లేమొయొయూరియొయూర మొప్పఁగన్.

తే. గీ. తెలుపు దెలిపిన నీవగ • దీనినమ్మ
దలఁచియుండిన దాని చే • తనుఁకు గఁటుఁగు
నమ్మ లోలోన కుములు నా • యమ్మ కొమ్మ
కతనుఁ జెప్పుము వన్నెబం • గారుబొమ్మ. ౧౯

తే. గీ. పసిఁడికిని సరదుఁగలమేయి • పసలుఁ జారె
పసితనంబున కెదలోన విసుకుఁ గదిరె
తొఁగలవిందును బోలిన • మొగమువాడె
తొఁగలనొందకఁ జెప్పుమో • తొఁగలకంటి. ౨౦

సీ. దొండకెమ్మోవి నీ ♦ దండకు చిలుకలు
జేర మేల్చదువులఁ ♦ జెప్పవేల
నలమబ్బు కీల్గంటు ♦ నమిలి పులుఁగుల
జేరి చిందులుద్రొక్క ♦ జెప్పవేల
యసలుపుట్టుఁగుకంటి ♦ వెసతెలిపిట్టల
జేరి మేల్నడకలఁ ♦ జెప్పవేల
చిగురాకుబోఁడి నె ♦ చ్చెలిమి కోగిలగుంపు
జేరి మేల్సొరములఁ ♦ జెప్పవేల

గీ. విరియఁబారిన విరజాది ♦ విరుల పొగడ
పొన్న గేదఁగిమల్లియు ♦ మొల్ల జిలుఁగు
గన్నెరులపూల సోగుల ♦ కారుకౌరు
మొగుల కీడఁగు కీల్జడ ♦ ముడువవేల. ౯౧

సీ. రంగుమేలిమి మేన ♦ బంగరుసొమ్ములు
బెట్టక నీ విట ♦ బెదరనేల
చిన్నిమొగంబున ♦ వన్నెకస్తురిఁబొట్టు
దిద్దక నీ విట్లు ♦ త్రిక్కులేల
కుతుకసొరంబున ♦ కుతికెలఁ బడవీనె
సొరెలగీటవు ♦ సరమ దేల
తియ్యన కమ్మనఁ ♦ దేరిన నుడువుల
మాతోడ నుడువక ♦ మసలనేల

గీ. గందమును వచ్చకప్పూర ♦ మందముగను
చేయ దమ్ములు నక్కన ♦ జేర్పవేల
లేచి పూపొదరిండ్లలో ♦ లేమ తొగల
మేలుగా గూడి నడువ వి ♦ దేలఁ గోల. ౯౨

ఉ. ఓరుచు కొమ్మగోడు తెద ♦ నొయ్యన పూవులమాలె లక్కనన్
చేరుచు కొమ్మలో దలఁపు ♦ చెల్వపుచేడెల కెల్లఁ దెల్పెడిన్
దారిచి పూలవిల్తునకు ♦ దక్కవకారులఁ జెప్పి నిల్వఁగా
నేరుపు జాలకున్న విను ♦ నెవ్వగలు న్మది నుండునో చెలీ. ౯౩

క. ఇటువంటి గుట్టు లున్నను
కటకట మాతోడఁ జెప్ప ♦ కను నీ విపుడె
చ్చటనైన నుండుదానవొ
తటకున వివరింపవమ్మ ♦ తళుకులబొమ్మా. ౯౪

తే. గీ. అనిన తా విని తలవంచు ♦ కొని యొయారి
కాలు చిటికెనవేల్ గోర ♦ నేల వ్రాయు
చును కనుఁగవను కన్నీరు ♦ చనులదంట
కొప్పరంబులఁ బడఁగ వా ♦ కొనె ముదుంగు. ౯౫

ఉ. చక్కరవింటివాని పెలుచ ♦ న్గెలువన్ దగు గట్టుఁ దాల్పరిన్
జొక్కులుమీరునట్టి నుడి ♦ చొప్పులుఁ జెప్పి బిరాన వాని నా
చక్కికి వచ్చునట్లుఁ గను ♦ సయ్యన జేసెదనంచు నేగిరా
[illegible]క్కను తుంటవిల్తు బలు ♦ దాడికి సుందితి నెట్టులో చెలీ. ౯౬

తే. గీ. అందలేనట్టి మ్రానుపం ♦ డందబోవు
మూడ్కి కలుముల పడఁతికి ♦ మగఁ డనంగ
వెలయు ముప్పొకలానినే ♦ విరిలకోరు
కాని పోరున గవయుఁగఁ ♦ బూనుకొంటి. ౯౭

తే. గీ. ఎవరు నాకోర్కి దీర్ప మ ♦ తేఁగగలరు
ఎవరివేడుదు నిచ్చట ♦ నెలికైన
చెలిమి చేడియ మిన్నగు ♦ చెలువ పద్మ
నియిటఁ గలిఁగిన నాకును నెమ్మి పొసఁగు. ౯౮

వ. ఇట్లు నెచ్చెలియలతో కుబ్జ వాకొనుచున్నంత కళికి గోనంబులు
గలుఁగు చంద్రముఖి యను మెలఁత యిట్లనియె. ౯౯

ఉ. సాటివలంతులీ వలపు ♦ సాగిన బెంగను బెట్టు కుందు రే
తోఁటను ద్రిమ్మరిల్లుతఱి ♦ తోఁపరిలుం బహువారలుండ రే
మాటికి మాటికిన్మరుని ♦ మామనుపుల్గులఁ గాడ్పుఁజూచి యా
రాటము వెందమండిడప ♦ రాకిది గల్గకఁ బోవుపెట్టులర్. ౧౦౦

శా. ఔనే యెంతలుఁ దెచ్చుకొంటివిక నా ♦ హా యేమనన్వచ్చు నీ
కీనేలన్ జతయైన జవ్వనులులే ♦ రే వారలీ వింతతో
వైనంబు న్వెసవిన్న నవ్వెదరుతే ♦ వన్వేగిరంబుం గొనన్
గానాయుంబునుఁగాదు నూఁగుకొనుమా ♦ కన్నయ్యతో తెంచెతున్.

ఆ. వె. అనుచు వలపుమీరు ♦ నతివెకు మేలైన
నుడులు కొన్నినుడివి ♦ యుడుకు దోలఁగ
జేసి మెలఁగించట ♦ చెలఁగి కన్నయ్యకై
తరలిబోవు నవల ♦ తారుఁదాక. ౧౦౧

వ. నట్లు ముగుదలు వినిపించిన పూఁదోటలో కన్నయ్యవలపులం బడి
దిరుగుచుండె. నిచ్చోట దేవకికొడుకు కుబ్జ మువ్వంక లెగయఁజేసి
కమ్మచ్చు పోసినబంగారు తీఁగమాద్రి నలరారు కన్నెక నెగాటగ
కన్నుల పండుగుగాకనుం గొనునది మొదలు జగము తండిరడెం
దంబు తామరపాకున జలకంబు లాకునంటక చెదరాడువగ కమ్మ
విలుకాని పువ్వుటమ్ములకు సొమ్మసిల్లి యుల్లంబు తల్లడిల్ల నన్న
తోనున్న సకులతో రాచదారిం బోయిపోయి విలుగీముఁదరి
యంజొచ్చి సురతాణివింటికై వడి పెద్దదియై బీరముఁగల మగలకు
దాల్చుటకు ద్రేఁకయై యలరారుచున్న సింగాణికి యచ్చటిపజలు
వలదువలదనంగ నారిమోపెట్టి ఖణిల్ ఖణిల్ మనునాదు నలుదె
నలఁచెలరేగ రెండుగంఁడికలుఁ గావించె. అత్తుండంబు లన్నదమ్మ

లుచేగొని నచ్చోటి కాపరిపజలు వజీరులు గరువించి చుట్టుముట్టిన మట్టుఁబెట్టి రాచకొలువునకు జనుచుండఁ ద్రోవ కువలయాపీత మను నేనుంగును యశోదకుఱ్ఱనిఁ బరిమార్చుటకై నిలువ నయ్యాదిమస్తి గలిగి మావంతునంకియకు నిలిచె నంతకుమును. ము కనకతప్పెట గుమ్మటకై ముడి నగరతుకును మొదలగు చప్పుడులచే మ్రోఁగు చుండునదియు చాణూరుఁడును ముష్టికుండు నరిష్టుఁడు మొదలు మల్లడించెడుకొలంబుచేతఁ దిం(డించునదియును కప్పురపుపునుఁగు జవ్వాదిమలాక వ్రానీరుకలిపి దుమారము లేవకుండునట్లు చేసి నదియు బొడిపిరాళ్లు వయ్యాలు మిఱ్ఱుపల్లంబులు పుట్టుగోతులే కుండునట్లు కోమలికంబుగా నుంచినదియు పడగజెండాలు పువ్వుల మాలెలతో బురణింపనేసినదియు నేలవేలుపులు రాచలు కోమ టులు నాలవకొలంబువారు నన్నకొలంబుల వారితో మ్రోఁగు చున్న నొంటియుడుగు కత్తెరనేలకుం వెన్నుండన్నతో నరుఁగు చుండ రాచమిత్తలు పురికొల్ప మదపుటేనుఁగు బరి కొని యానచే నెదురించిన వెన్నుం డిట్లనియె. ౧౦౩

తే. గీ. ఓరియేనుఁగు గాచెడు ♦ కారుచదుగ
మాఁదెసకు నేగుదెంచుట ♦ మంచిదిటర
మరలఁగాజేసి బ్రతుకుము ♦ మరలవేని
తప్పదిక చావునీకు పె ♦ త్తనముచేత. ౧౦౪

చ. అనవిని మావటీఁడు మురు ♦ వారఁగమీఁదికి ద్రోలినం గనుం
గొని మొలహొన్నుకాసె నల ♦ కొప్పును బిగ్గఁగఁజేర్చి వెన్నుఁడున్
గనలుచు తొండమంది నుడి ♦ కారము నొప్పపజల్ వినంగనం
దునిమొగపల్లవన్ బెరికి ♦ తోడ్పడువాని బలారెయుంచనన్. ౧౦౫

వ. ఇట్లు గజ్జేనుఁగునుం బరిమార్చి దాని నిడుదలై తెల్లనై యలరారు రెండుపళ్లను బెరికి చేపట్టి రాముండును కృష్ణుండును మావటిని

భీకరముఁగల ప్రజలను రాచవారిదండును మట్టుబెట్టి వచ్చుచుండ
తోటిరాచలిసప్రక్కలం గూరిచుండి పలువితంబుల మాటలాడు
చుండ నొక్క పెద్దమంచెయందలి తళతళయను మూతాబిఁ గూర్చిన
పట్టుతివాసి యందుపైన జిల్లేడదూది చేసుఖు మాయములుదిండ్ల
యెత్తుగా మెత్తదలకై నతికించిన దానియందు బసచేసి మంతినిగమి
పుడమిఱేడు లోనరించిన తప్పొప్పులెల్లఁ జెప్పి నాటికిఁ దగిన మంచి
చెడ్డలు వినుపించుచుండ నందు ముష్టికుండరిష్టుండు చాణూరుఁడు
మొదలగువారున్న యెడ మనువు పరుపు నేలను కుప్పించి పెనువెల్లి
తరిని ముజ్జగంబుల చెందు చెండాడ నిలిచిన మిత్తిమిత్తి గొంగల
తెరఁగున సవ్వళింత సేయుచు తాటికి నెత్తువచ్చు గూపులతో నెత్తు
రుఁగ్రక్కఁగను గవలతో నన్నెల నడ్డపాటులేకుండ పచేరంబు సేయు
చున్నవారిం దరియం జొచ్చి గట్టు గట్టుపోలిక కోల్పులి కోల్పుల
మాఁదిరి యేనుఁగు నేనుంగు చందంబున సింగంబు సింగంబు తీరు రెట్ట
బలిమిగల బలిమికాండ్రఁ బట్టి మిట్టిపడుట పట్టుదలయేయని కేలున
కేలు గీలించి కాలుకాళ్ళలం జొనిపి పడదిగిచి పేర్చియూర్చిన సయ్యో
ద్దరు గ్రద్దనపిరుతివక పిడికిటి బొడుపులకున్ జెదరని యెడదగలిఁగి
యోరసారించి తెరలక మరల పొరలఁద్రోచ్చిన వెన్నుండు తనయే
నుఁగు తొండంబులబోలు కేలుదంటసాచి మగరాలవలె కటికెతనం
బుగలదాయ నొడలి పిడికిట విడువక పొడుచుచు నడుగులం బట్టి
నాయంబు తప్పక నడుగిడుచు నడుగులం బట్టి ముమ్మారుఁ ద్రిప్పి
నేలపై జరిచిన మోములనుండి నెత్తురుల గ్రక్కుచు జేజెల పట్టుం
జేరం జనిరి. నత్తం రోహిణికొడుకు నట్లె యొనర్చిన జగంబులెల్ల
గొనియాడ నందుడు మొదలు గొలువువారందఱు కంసుని సరసనఁ
గూరుచొని చూచుచుండిరి తరువాత నిదురించి యా కటికతో లేచి
కొండసారంగంబు పీడిన సింగంబు చందంబున కఱటిపజలను తెగ

టార్చి కన్నయ్య సింగంపుపీటపై మల్లులు తనను గారియబెట్టక
నికరంబువదిలి సూచుచున్న కంసునిగాంచి ముబ్బబ్బా యీదుష్ట
గీడు నా కొరకు నా తల్లితండ్రుల కారంజేర్చి రాచలచ్చిమి పెను
ద్రేకను దాల్చుటకై తండిరియగు నుగ్రసేనుని చెరసాలనుంచి
తన యిచ్చతీరునట్లు దిరిఁగెనని దాపుంజేరి బొమిడికంబుపై కేలు
దమ్మిఁ జేర్చితిగిచిదలవెంట్రుకలంబట్టి నేలకీడ్చిన వాడంతకు
ముందె కన్నయ్య రూపునుగాంచినంత విత్తివలెదోచి మోము
డంబంబుదప్పి తేజులేకనుండె నతని ముట్టినంతనె నసువులవీడి
వినువీడు సుగంబు జూడంబోయె గానితమ్ములును జరాసంధుడు
పల్లాకి పజల నైదుకొని కాలయవనుండను తురక యేతెంచి
ముట్టడించిన కయ్యంబున తీరుపాటుగావించి మధురనువదిలి సంద
రంబులో ద్వారకయను పేరిటితో రాచనగరు గావించి నందు
సుగంబుండై భోజకొలంబునకు ప్రులియగు నుగ్రసేనునికి మరలి
రాచలచ్చిమిని కట్టించె తన తల్లిదండ్రుల చెరవిడిపించి సుగం
బుండ నొక్కవాడంతిపురిని మెత్తని సెజ్జపై బరుండి కుబ్జ చేడియ
కనుదమ్ములఁ గట్టినట్లైన కన్నయ్య. ౧౦౬

సీ. క్రొల్లంటి మేటి సిం ♦ గారంబు దలపోయు
జవరాలు రూపు న ♦ చ్చముగ నిలుపు
చిలుకలకొల్కి మ ♦ చ్చిక మాటలో నెన్ను
కన్నియ కోమలి ♦ కము దలంచు
తెలిగంటి వగటు నా ♦ ద్దికతోడఁ దూఁకొను
కప్పురగంది చ ♦ క్కదనమెంచు
వలఁతి మేన్వలపుల ♦ వసనుఁ గొనియాడు
సోఁగకన్నుల మది సొక్కుదలఁచి

గీ. మగువ తిన్నని మోము తా ♦ మర మిటార
మునకు మెచ్చును మాటలు ♦ పొంతనమున
కెడద సంతోసమందు వి ♦ దేర్పడంగ
లచ్చి మొగడిట్లు తలఁపు త ♦ లంచియుండె. ౧౦౭

క. తొలఁగున్దడబకు రెచ్చె
మొలఁగున్గడు చందిరికను ♦ మేల్ మేలనుచున్
కలగున్మరుని తలంపున
కలగు న్మేన్పడక జేర్చి ♦ యలసట నొందున్. ౧౦౮

వ. చెఱుకువిల్తుండొఱ బెటికి గఱకటిగాక కఱుకు మెఱుఁగు గొరకల కఱఁద దూరనాటినఁ బసచెడి దనయింటి చేరువకుఁ వేరువడక సారువలుఁగల పూఁదోఁటలో సారెసారెకు దిరిగాఁడు మరుని వారువముల పారువముల గోరువంకలతో రాగిల్లు పూవులకోవుల మావుల తీవియలనుఁ జూచి కళవళింపుచు నొక రాయబారి నంపుటకు తలంపుసేయు నంతలో కుబ్జవెలందితో యాననొంది యేతెంచిన పద్మిని రాణివానంబున కానంతైన కన్నయ్య జాడ లెరుంగక తోడి ప్రోడలకు పిడియంబులొసంగి పోడిమిగల వేడుకల నాడుచు తెరువెఱింగె. ౧౦౯

తే. గీ. అంత పద్మిని నాచెలి ♦ యలరువిల్తు
తండ్రికడ కేగుదెంచి వి ♦ తాకునొందు
చెలువ వక్కాణమంతయుఁ ♦ జెప్పుటకును
కేలుమోడిచి యిట్లు న ♦ గ్గించె బగిది. ౧౧౦

(కందగీత గర్భ చంపకమాలా వృత్తము)

కదు॥ కఱివేలుపా । గవురు । కన్నఱ । కానలగాలిమిత్తన
ల్గడ । దవురా । మసన్మొగులు గచ్చునికౌమెయి మువ్వకాడప్రే ।

ముడి। నెఱితో। నెసందలఁతు। ముప్పురిపోకలతారువాడపాల్।
కడలి బసా। జగా గొనము। గైకొని బ్రోవుము కోర్కెలూరఁగన్॥

క. కఱివేలుపాగవుసుక
న్నఱకానల గాలిమిత్త ♦ నల్గడసవురా
నెఱితో నెసం దలఁతు ము
ప్పఱిపోకల తారువాడ ♦ పాల్కడలి బసా. ౧౧౨

గీ. గవుసుకన్నఱ కానల ♦ గాలిమిత్త
మొగులు గచ్చుని కౌమెయి ♦ ముర్వుకాడ
దలఁతు ముప్పురిపోకల ♦ తారువాడ
గొనము గైకొని బ్రోవుము ♦ కోర్కెలూర. ౧౧౩

(చతుర్విధకందగర్భ ప్రమితాక్షరవృత్తము)

నెలప్రొద్దుకన్నుఁగవ ♦ నిగ్గులమై
కొలమ్రబ్బుపైరగుఱి ♦ గొట్టెలమిన్
గలనీరు వామియిలు ♦ గల్గు లలీ
నలవేల్పనే గొలుతు ♦ నాకలిమిన్. ౧౧౪

(ఇందు ప్రతిచరణమాదిగా చతుర్విధకందములు జనించు)

గ. ప్ర. కం. నెలప్రొద్దు కన్నుఁగవ ని
గ్గులమై కొలమ్రబ్బుపైర ♦ గుఱిగొట్టెలమిన్
గలనీరు వామియిలు గ
ల్గు లలీనలవేల్పనే గొ ♦ లుతు నాకలిమిన్. ౧౧౫

గ. ద్వి. కం. కొలమ్రబ్బు పైరగుఱి గొ
ట్టెలమిం గలనీరు వామి ♦ యిలుగల్గు లలీ
నలవేల్పనే దలఁతు నా
కలిమి న్నెల ప్రొద్దుకన్నుఁ ♦ గవ నిగ్గులమై. ౧౧౬

గ. తృ. కం. గలనీరు వామియిలుగ
ల్గు లలీనలవేల్పనే గో ♦ లుతు నాకలిమిన్
నెలప్రొద్దు కన్నుఁగవ ని
గ్గులమై కొలమ్రబ్బు పైర ♦ ఘురిగోట్లలమిన్. ౧౧౭

గ. చ. కం. నలవేల్పనే గోలుతు నా
కలిమిన్నెల ప్రొద్దు కన్నుఁ ♦ గవ నిగ్గులమై
కొలమ్రబ్బు పైర ఘురిగో
ట్లలమింగల నీరువామి ♦ యిలు గల్గులలీ. ౧౧౮

(చతుర్విధకందం)

గ, ప్ర. కం. వరుసమనిచితివి వెసదే
వరలను రుసిగమిని బ్రోచి ♦ వాడిమి నెసగన్
బెరసుపజజదిపి యొలమిని
విరివిని ససిబుడమి కిచ్చి ♦ వెలఁగితివి సరిన్. ౧౧౯

గ. ద్వి. కం రుసిగమిని బ్రోచి వాడిమి
నెసఁగన్ బెరసువజజదిపి ♦ యొలమిని విరివిన్
ససిఁ బుడమి కిచ్చి వెలఁగితి
విసరిన్ వరుస మనిచితివి ♦ వెసదేవరలన్. ౧౨౦

గ. తృ. కం. బెరసు పజజదిపి యొలమిని
విరివిని ససిబుడమి కిచ్చి ♦ వెలఁగితి విసరిన్
వరుసమనిచితివి వెసదే
వరలను రుసిగమిని బ్రోచి వాడిమి నెసఁగన్. ౧౨౧

గ. చ. కం. ససిబుడమి కిచ్చి వెలగితి
విసరిన్ వరుసమనిచితివి ♦ వెసదేవరలన్
రుసిగమిని బ్రోచి వాడిమి
నెసగను బెరసుపజజదిపి ♦ యొలమిని విరివిన్. ౧౨౨

(మత్స్యబంధము, భద్రికావృత్తము)

రార కన్నయ మాటామాటికీ
కోరిఁ జేరితిని మేరగా
గారవించి కొలఁదోలఁగా
మేరయారయెద నెంతురా. ౧౨౩

(ఖడ్గబంధం, సుగంధివృత్తము)

ఏటిబోటి మేటిలోన ♦ నిక్కనిక్క చక్కఁగా
గాటమైన నీటిబండు ♦ గట్టుదారి యేలికా
కాటిఱేడుబమ్మఁ గొల్వ ♦ కల్మి లిచ్చి బ్రోవఁగా
గాట మిచ్చు నీటిచాగి ♦ కాహళాఁరంగుమైచొకా. ౧౨౪

(మర్దళబంధము, మావకణవృత్తము)

మేలుఁగడించుదు సాలున్
గ్రాలగ వక్కవామాయిన్
మేలుగ నెక్కి వాసారిన్
చాలగ బ్రోచెదుమా-రా. ౧౨౫

(కూర్మబంధము జలదవృత్తము)

కారడి మేల్మెఱుంగు మెయి ♦ కన్నయ సిం
గారపు మాఁన్నుకోక పర ♦ గన్వెనుకన్
దారవెదాయల న్మెదుప ♦ దాఱుజగా
మేరలు పాముకన్దపులి ♦ మెల్పడుకో. ౧౨౬

(కుండలిబంధం, ఉత్పలమాలావృత్తము)

బంగరువక్కసాలు వలె ♦ వాటు తటుక్కున వెల్గుసామి తె
న్నంగలవాగు బత్తిమది ♦ సంతసమై లలితారుచు న్మసన్
రంగ నిను దలంచిరి స ♦ రానరి గచ్చుగునున్న చిన్నిటెం
కింగొన బ్రోవుమయ్య గిడి ♦ గిళ్ళుకిలార్చిన లేమచేగమై. ౧౨౭

## దండకము

సీరామవేల్పా బయల్జేజెలుం బమ్మముక్కంటియుం దుగ్గిజక్కు-
ల్మొదల్గా జగంబంత సిన్నెన్నగాజాలరే కాయసినీతలుం బత్తులున్మె-
చ్చగానేయుదెబ్లన్న తొల్రూపుమేన్మినులో మిన్నవై చాలప్రాగబ్బ-
ముందోచు ప్రావేల్పునుంబట్టి వాలారుముక్కంటు కొమ్మందగన్గుర్మిమ్మ-
యాబొమ్మకున్మేలు నొండంగవేసేసితొ వేల్పుఁగం రక్కసుల్గూడి
పాల్వెల్లినింద్రచ్చుచో నీటుతామేటిలో మేటవై కవ్వపుంగుబ్బలిన్వీపు-
నం దాల్చి జేజేలబువ్వ న్వెసన్దిసియుస్పంచితొ, జాళువాకంటిరాకాసి,
నేలన్వడిన్జుట్టి సంద్రంబులోవైవగా జన్నపుంబందివై వాని మూరా-
ముగుర్తించి మన్నిందొలంగించి నీకోరచే నేలలేనెత్తితొ, కుఱ్ఱసింజట్టి
చెడ్డాటుగావింపకంబంబు నస్మిదివై సింగమై, క్రిందుపాల్మాసిసింబోలి
బామందితొల్వ్రేలుపుం బట్టియుం డొక్కసుంజీల్చి రోసంబు ఱెల్లారఁగా
రాబ మొప్పంగ దేవళ్లనుంగాచితొ, గోచిబాపండవై మూడుపాజల్బ-
లిన్వేడి, నీ నేర్పునుంజూవఁగా బొమ్మగుఱ్ఱుంగడున్నిండి మూడజ్జలం
జూపితొ చేతిగొడ్డంటముయ్యేడుమారుల్ నెత్రాయలంగొట్టి యానె-
త్తురుం దండ్రికిన్ బిండలిన్వైచి, రాయాదలల్గూర్చి జేజేలమిల్చక్క-
కిన్ దంతియల్గట్టి పెంపందితొ, చాలుగా తేలురున్వ్రాల్గు పేరింటిరాఱేనికిం
బుట్టి రాకాసినింజెండి, జన్నంబునుంగాచి మేల్వాజ్జలంబుట్టు దుబ్బన్గలు-
న్నాతిగాఁజేసి యున్నేలచూలిం గడుంబెండ్లియై మించి రాదారిలో కా-
వరంగల్గుపాఱున్గరాళించియున్రోబ్బలునుంజీరి తానయ్యయానన్వడిన్
లంకలోఁజేర సన్నాసులుం బొమ్మచారుల్ సరాబారులుంగొల్వగా
నాకుపాకన్ దగంగొన్నినాళ్ళుండి యచ్చోటునుంబాసియుం సీతఁగో-
ల్పోయి తోబుట్టువుం దోడురారుస్యమూకంబుకుంజేర రేకంటుమేపు-
ట్టువుంజూచి నెయ్యంబువాటించి మ్రాన్దిమ్మరుల్గొల్వ సంద్రంబుపై
వంతెనంగట్టి రెండైదులెక్కన్దలల్గల్గు రాకాసిసింజంపి వేవాసిసైదో-

డునుఱ్ఱ ఱేనిగావించి యున్నెలచూలి న్వెసంగూడియుం బుష్పకంబెక్కి
దమ్ముండునుం గొల్వఁగా వీటికై వచ్చి సంతోసమున్ మమ్మతిల్లంగ
చుట్టుండురా రాయలుం గప్పముల్వెట్ట, పెంపొందియుం బత్తులంబ్రోచు
తొ, నల్లవల్వన్ మొలందాల్చియుం బైడిచూలాలిబక్వఁ దోలంగిం
పరాకాసిపాలఱ్ఱ దగంబుట్టు రారాజులం గొంతిమేపుట్టుకల్ బాసటం
గల్గఁగాఁద్రుంచి నేలన్ సతంబిచ్చఁగాదిగ్గితన్నయ్య వైచాలఁగ్రొల్గంటులం
న్నేలవా చాలవాఁబ్రోవఁగా, నీవుమేల్మేలుగా బుద్దరూపుంగడుందాల్చి
సద్దారిలో మేటివై దాయలంబోరు సందారునంగెల్వఁగా రావిమ్రూ
ల్లోనిసలొదూటి ప్రావేల్పుయోముూరులం గొప్పఁగాదప్పులుం లేని
మేల్నోములున్నోచఁగాఁ జేసి యున్వారిబన్నంబులం బెట్టి ముప్వీటిపే
రింటితొల్వేల్పులం ద్రుంపగా ద్రెంపఁగా జిల్వరాదాల్పుకై బాసటన్
జూపితొ, తేజిపై నెక్కి యుండాలుమీరంగ చెన్నంటులొఱేఁడులం జీల్చి
నాయంబులం బాటపూఁబోఁడిపై నాల్గుహజ్జల్ వడిన్నిల్పితొ, నీకడింద్రై
నచెయ్యుల్ దలంపఱ్ఱ నురన్మత్తికై గ్రాలు నిన్నున్నతిన్గొందరున్ వేడ
గుల్నేరకన్ దొడ్డుగా బిడ్డలన్గొడ్డులన్, మేడలన్మాడలన్గోడలన్జేడెలన్,
కుజ్జులంబజ్జెలం గుఱ్ఱముల్ గల్గు కల్ముల్ తిరంబంచు వేసమ్మి ముత్తింగొనం
లేక నేలన్మతింబుట్టి చావొప్పఁగా వెండితాబుట్టుచున్ జచ్చుచున్ దుం
తరాతుండుపట్నంబుకున్ నేలకుండిర్గగా లేక నిన్నెప్పుజోగుల్ తలంపొ
ప్ప జేజేలుతొల్వేల్పువేఁగంటి చొఁగంటి రేకంటిమేపుట్టు వాఱొసనా
యండు నీర్వామిరాయండు మేల్లేటిబాబాయు కాసెద్దడింగాచు విన్ది)
మ్మరీడున్ మొదల్గల్గువారెల్ల వినెక్కింపుజాబిల్లియున్ జక్కటుల్పక్క
ముల్సందెలున్నందు పుల్కారులున్పెద్దలుఁద్రొబ్బదులున్మన్కులు న్గబ్బము
ల్గొలె నాబమ్మగ్రుడ్డంత నీవంచువేగుండి యున్నమ్మి నీతావునుంజూచి
వేతారుచుండంగ మెల్నాటికై మేటివై యుండుకన్నయ్య నిన్నెప్పు నీ
చిన్నెలన్దప్పకన్నెంచు నాకన్నెకున్నీదు చెన్నుందగన్జూపి కావంగదె
లచ్చితేఁడా, జగాపక్కిగొడా జొహారుల్ జొహారుజ్జొహారుజ్జొహారుల్.

చ. సిరి చెలిమించుగా బొమలు ♦ సింగిడిగా బలులోతు సుద్దులో
యురుములుగాఁ జెలంగ జెలు ♦ వొప్పెడిసల్లని మేనుఁమ్ర
బ్బుని బరికవుసోనలం గురియ ♦ బల్మెరు చేడియ వానకోయిలన్
హారువుఁగ జేరి బ్రోవుము జొ ♦ హారులు వేలకోలంది సేసెదన్.

వ. అనిసంబరంబున నక్కఱిచేల్పుం జేవగా నగ్గించి తన దేవెరి సుద్దివినం
జెప్పఁ జిలుకపలుకులకు సరుదుగల నుడువుల నిట్లనియె. ౧౩౦

సీ. వలవంత కారగ్గి ♦ వలన బుట్టినరోజు
వదలిన కెమ్మోమ్మొవి ♦ వట్టవార
కాటుక నెరయుంగ ♦ కన్నవజలకంబు
కాలువలగుచు చ ♦ న్నవను బాఱ
చెక్కుటఁ జేర్చిన చేదమ్మి ♦ కాఁకచే
మోముదామర నీటు ♦ మునుఁగువడఁగ
పలుమారు ననవిల్తుఁ ♦ డలరుతూపులఁ గ్రుమ్మ
కదలనిగుండె చీ ♦ కాఁకుఁగాక

ఆ. వె. నవతమీర మోము ♦ ననుచెమ్మటలు వాఱ
తలఁపులోన నిన్నుఁ ♦ దలఁచి తలఁచి
గువ్వగుత్తి కోదవ ♦ కొన్ని మొల్నుడువుల
నిన్నుగూర్చి చెప్పి ♦ సన్నుబంచె. ౧౩౧

సీ. ఇగిరించులే మావి ♦ చిగురులచే సొక్కు
కోయిలఁ జేరునే ♦ కొడిశలకును
మిన్నేటి నీటిలో ♦ మేలుగా దిరివెను
యంచలు చేరునే ♦ వెంచలకును
చందురుమామ మేల్ ♦ చంటిరి కనుదిను
యేగునే నెలత్రావుఁ ♦ డివములకును

నీటఁబుట్టుఁగు కమ్మ ♦ నీరుఁద్రావుచు చొక్కు
తుమ్మెదలేగునే ♦ తుమకి గమికి

గీ. నీదుబాగైన యడుగుల ♦ నీరుపుట్టు
వులసు నీనవ్వు నీపాట ♦ ఉలదురూపు
లందె నాబుద్దినిలిచె నా ♦ కన్నులపయి
నానఁజేరదు నీయందె ♦ నచ్చియుండె. ౧౩౨

తే. గీ. మున్నుకల్మల ప్రోయాలు ♦ చిన్నిబోర
నిలచి మనవుము నన్నని ♦ నిన్నువేడి
మరల నీ యంజదమ్మల ♦ మరువకెలమి
కొసరి యంజల బుక్కాము ♦ గోరెగాదె. ౧౩౩

తే. గీ. వేలుపుల గాచుదేవర ♦ వితము నీవు
నిబ్బరంబున నీకేలు ♦ గబ్బిగుబ్బ
దుగలఁ దలపై నిబెట్టినఁ ♦ దొగల బాసి
నేను మనిమెదనేల బి ♦ రానరమ్మ. ౧౩౪

క. నినుఁజూచు కనులతో చ
క్కని వెయ్యవియైనఁ గాని ♦ కననోడును గ
క్కన నీకని పెంచిన మే
యిని నొరులం జేర్పనొల్ల ♦ దెల్లెడనైనన్. ౧౩౫

ఉ. సింగముఁబోలు నెన్నడుము ♦ చెందొవరాయనిమించు మోము మే
లుంగడకంటె చూడుకుల ♦ లో జగమంతయునంకె జేయుచున్
బంగరు దుప్పటంబువలె ♦ వాటుగ వేసిహారంగుమీర నా
కుంగనుబడ్డ రూపుకులు ♦ కున్మతిఁ గాంచగ నిచ్చ జేసితిన్. ౧౩౬

సీ. మొల్లమొగ్గలసాటి పెల్లగు పల్చాలు
బలుకెంపు మోవిపై ♦ బరుపకున్న

వెడలుపుగలబోర ♦ విడి గుబ్బలంటగా
నింపుమై వే కౌఁగిలింపకున్న
నీటి పుట్టుఁగుబోలు ♦ నీ కేలుదుగలను
చెల్వైన కౌవ్వునఁ జేర్పకున్న
నిబ్బరికవుచూపులుబ్బగ వెల్లనా
నెమ్మోముదమ్మిపై ♦ నిలుపకున్న

గీ. నోర్వగాలేను నాయందు ♦ మురువుమీర
రమ్మ రావేని యిట నీవి ♦ రాళియగ్గి
చేత నీరైన నిన్వేడ్క ♦ జేసి నీవు
నడుగుదమ్ములకడఁ జేరి ♦ యుండగోందు. ౧౩౭

వ. అని యిట్లు కొన్ని నుడికారంబులగు పోలుపొందు తియ్యని నుడులచే వాఁక్రుచ్చి యక్కటికవేల్పుం జూచి వెండియు నప్పడిమ్మని యిట్లనియె. ౧౩౮

క. తొయ్యాలి వలుపులు పెంచ్చిన
కుయ్యిడుచున్నంత మరుఁడు ♦ కు సిగుంపులుఁగా
తియ్యని విల్లందియు వేఁ
కయ్యానికి కాలుద్రవ్వేఁ ♦ గా కతివేల్పా. ౧౩౯

చ. సరవిఁగ వెన్నెలంగనిన ♦ జక్కవతీరుకడిందిద్రుబ్బు పెం
పరసిన తూడుతిండిపరి ♦ నక్కట బెబ్బులిఁగన్న లేఁడిమా
దిరి కడి పూలసెజ్జవయి ♦ తీఁగయెలుంగున కాఁకునొందెనా
విరిహాదనందు దొంట్రిలెను ♦ వెచ్చలకాకల నోర్వలేమి చేన్. ౧౪౦

క. దక్కినవుఁ గాలి వీఁవఁగ
పక్కులు వగఁగలుఁగ గూయ ♦ వలదొం నెలలుఁగ్
ద్రుక్కగనేసిరి చీమ చి
టుక్కనిసన్ నీవటంచు డొంకుచు చూచుఁగ్. ౧౪౧

మ. అనలుం బుట్టుగుఱం బఱుఁడౌ నెల చె ♦ ల్వారం బో గల్గిక్క డా
ల్పస తెల్మ్రొత్తపుఁజాలు మై కళుకు మేల్ ♦ బంగారు తీవే మొ త్తె
ల్పఁగలాఁ కెన్ సరిఁ దొల్ల నెమ్మొ మొగమౌ ♦ యిం దాకగాఁ గ్రొక్క నీ
మనవల్పుం దిన గాదె హోవడాల వే ♦ మారుం బడెన్గన్న యా. ౧౨౨

క. అని హాయలుగ నచ్చెలి సు
ద్దినివిరిగాఁ బలుక నల్లఁ ♦ దేఁపర యెలమిన్
బెనగొనగ చెలువతో వ
న్నెగలిగల నడికారమరివి ♦ నంబలికె మసన్. ౧౨౩

ఉ. మాపటి ప్రొద్దుగ్రుంకవిను ♦ మా చెలికానిని గూడి నేడు నే
నాపె బిడారు జేరమురు ♦ వారఁగ వచ్చెదనంచు దెల్పుమా
చూపరి పూలవిల్తునకు ♦ ప్రుక్కక గట్టితనంబు బూని తా
దూపిలియున్న వద్దికను ♦ తొయ్యలి మేల్రతినమ్మ గద్దనన్.

క. అని పలికి పోవఁబనిచిన
ననఁబోఁడికయి నొమ్మగిడ్చి ♦ నలమేన్దొరకై
గునపు నగిడి గిల్లిడి గ
ద్దన చెల్మి పడఁతియున్న ♦ తావలము నకై. ౧౨౪

ఉ. వన్నె యొయారి వచ్చి ♦ చెలువంగని ముందటనున్న తీరు తే
కున్న వితాకు నొంది కెలి ♦ గొందియు కన్నుల తెప్పవాల్చకే
కన్నియ నెల్లఁ జూచి సర ♦ గన్నరసంగల ముద్దుగుమ్మలన్
బెన్నుడి వక్కణింతుమని ♦ వేగుఱుఁ జేరిన నందయొక్కనై. ౧౨౫

తే. గీ. వరుస వాకొనిరప్పుడు ♦ వలఁతిమిన్న
కరయుఁ జిగురాకు బాకువా ♦ డనేఁడుఁ బూవి
పోక నెడలోన నెకసేరి ♦ ప్రుక్కి గోడ
గములపాలయి యడిగోలె ♦ కన్నెమిన్న. ౧౨౬

చ. కుడువదు వంటకంబు నెఱి ♦ గొప్పునఁ దావుల పూవుసోగల
న్ముడువదు రామతమ్మలటు ♦ మ్రోలనుఁ జేరిన నాకు సుద్దుల
న్నుడువదు పూ[illegible]పుకకు ♦ నుం జెలిమూకలఁ గూడియాఁడఁగా
నడువదు గొప్ప యబ్రములో ♦ నర్చిన నన్నది కేమి సేతుమో.

ఉ. విప్పదులోవలం గలుఁగు ♦ వేసట నెమ్ములకెల్ల చిందులన్
జెప్పదు మోముఁ దమ్మికయిఁ ♦ జేఁగవచ్చిన తేటి మొత్తము
ద్రొప్పదు నీకునుం గొనదు ♦ రోయును కోయిలపౌజుకుం గను
ల్దిప్పదు నల్లమేనుఁగల ♦ దేవర వచ్చెడు త్రోవఁ జూచుటల్. ౧౨౯

క. ఈ రమణ నిదురలేకయె
సారెకు నిటురట్టుసేయు ♦ సాగెనుఁ బలుకన్
మారాడదు మముఁజూడదు
పేరిమితో నెపుడునిన్ను ♦ బేర్కొను పడఁతీ. ౧౩౦

క. అని పసఁగుఁ జేయు చెలియలు
వినుచు నుడులనాలకించి ♦ వెనుతోయముగాఁ
గనుమారాడక దనపే
రును వినఁబలికినను వీడె ♦ ప్రోయాలు వెఱఁ. ౧౩౧

తే. గీ. కన్నుఁదమ్ములఁ దెఱచిన ♦ ల్గడలమిన్న
నెల్లఁబరికించి యెడ్డలో ♦ నల్లటంబు
నివ్వటిల్లఁగ నచ్చటి ♦ నేస్తపుఁ జెలి
మానికంబునుఁ గనుఁగొని ♦ మాటఁబలికె. ౧౩౨

చ. కటకటనన్ను నిట్లువల ♦ కాఁకను సందరమందు ముంచినీ
వెటకుమిటారి యేఁగితివె ♦ యెక్కరణిన్ మరులుం దొలంగునె
చ్చటఁజొరుదుం బ్బిరాననను ♦ సారెకు కౌఁగిలి నీయవెన్నఁడె
న్నటి తరివచ్చునమ్మ విన ♦ నాదగుగంగఁ జెలంగనెల్తుకా. ౧౩౩

ఉ. వెన్నుని చెంతనాకుగల ♦ విన్నదనంబును విన్నవించితో
క్రన్నన నిన్ను నేఁడుసుకుగ ♦ న్వాని పల్కకమోస పోతివో
విన్నది కన్నయట్లు వినుపిం ♦ చితో నీదగు రాయబారమో
యన్నలమిన్నఁ జెప్పఁగదు ♦ నచ్చోటఁగల్గిన వింతయేర్పడన్.

సీ. అని కటివేల్పు పొం ♦ దున కయివెతలకు
పాదైన కుబ్జనాఁ ♦ బడఁతిఁజూచి
బన్నిని యిట్లనిఁబలికె ♦ కన్నీరుము
న్నీరుఁగాఁ జేసియు ♦ నీటుకాటు
కనుఁగడుఁగఁగ నేల ♦ కడువేడియూర్పుల
వలప పూసోగులు ♦ వాడెసెజ్జ
బారలఁగా నేరని ♦ పోడిమి విడనాడి
గబ్బిగుబ్బలఁ బూయు ♦ గందములును

గీ. చెదరిపోడిఁవ్రాలఁ ♦ జెక్కుటఁ జేయిఁజేర్చి
మోముఁ దామరవన్నెలు ♦ మొఱకవడక
చెఱఁగు ముసికిడినిట్టుల ♦ చెల్వ కాని
కొఱకు కుందంగ నేటికే ♦ కొమ్మమిన్న. ౧౩౫

క. అని తానుఁబోయికన్న
య్యనుఁ గన్గొని ముచ్చటాడి ♦ యానతిగొనివ
చ్చిన ముచ్చటంత చెలివా
కొని నెలఁతకుఁ దెలిపెఁబూస ♦ గూర్చిన మాడ్కిన్. ౧౩౬

వ. అంతమచ్చకంటితో నిచ్చగా కొన్ని ముచ్చటల మచ్చికగా ముచ్చ
టించి మఱియు. ౧౩౭

చ. తెలిసితిఁగాని నీవలపు ♦ తెమ్మరవీఁవ మగుండుకిన్కతో
నలరుల కోరుతేయు చెలు ♦ వారగ కోయిలజిల్క సారెపై

ల్లలమటఁ నొందగా రొదలు ♦ పాళిగసల్పగ సైపలేవునీ
చెలువలఁగూడి మేడకిక ♦ జేరఁగబొమ్మ్న పరాకువొల్లనొ. ౧౩౮

తే. గీ. ఇటుల నేస్తపుచెలిబల్క ♦ యింతి మిన్న
చెల్మపడఁతుక చేదమ్మ ♦ చేయినమ్మ
నిచ్చివయ్యెట నవరించి ♦ యొలపుమీఱ
నంచనడకల కొయ్యార ♦ మొంచనడచి. ౧౩౯

ఉ. మేడకుఁజేరఁబోయి చెలి ♦ మిన్నలఁఖోఁ గొలువుండు నంతలో
వేడుకకాఁడు నల్లమెయి ♦ వేలుపుకొండొక చేడెఁజేరితా
వేడిమిగొన్న కుబ్జకును ♦ వేళముగానిదె రేయివత్తు నం
చాడినగొంతె నంతిపురి ♦ నాయమ వీడియు మిత్తమించగన్. ౧౪౦

ఆ. వె. వెన్నదొంగ యూన ♦ వినివచ్చి కొలువున్న
చెలువకఱుఁడు బుట్ట ♦ చెలిమిగలుఁగ
వేల్పుప్రోడఁజెప్పు ♦ వివరము కొరును
దెలియఁజేసి యేగె ♦ తెఱవమిన్న. ౧౪౧

వ. ఇట్లుఁ దెలియునంత నావగలాడి నగకాసక్తై, మిగుల వగలఁబొగిలి
తనలోన. ౧౪౨

ఆ. వె. ఎపుడుఁ బ్రొద్దుగూకు ♦ నెఱచి మేపరిగొంగ
నెపుడుజాతు వలపు ♦ లెపుడు దీర్చు
నెపుడు చందమామ ♦ యేతెంచునో కద
యనుచు వలువితాల ♦ నరయుచుండె. ౧౪౩

వ. అట్టి తోయంబున. ౧౪౪

(సూర్యాస్తమయవర్ణనము)

తే. గీ. వెనుకదెస సీమమేడపై ♦ వేడ్కమీఱ
రేవెలుఁదుక మెచ్చుతు ♦ రీన పసిఁడి

కుండ సేసియు క్రొవ్వు ♦ కొనలనుంచె
నోయునంగను చీకటి ♦ దాయ వెలిఁగె. ౧౮౫

క. వడమర కెలఁకువడంతికి
కడువడితతి బొజుగుకొఁడు ♦ తలిరుల కెంపుల్
విడివిడిఁ గూర్చిన బంతిని
తడయకఁబంపెనన కలువ ♦ దాయుఁడుఁ గ్రుంకెన్. ౧౮౬

చ. వలకులు నెత్తువాఱె చెలు ♦ వంబులు తామరలందుఁ దీరె పు
ల్గులుగమి చెట్లజేరె నెల ♦ కూటిపులుంగుల సేదఁదేరె బల్
కలువలరేకు మీఱె నెల ♦ కల్లులదాటులు నీరులూరె చు
క్కల తెగ గేరె కమ్మవిలు ♦ కాడులకోరులనూరె నత్తరిన్. ౧౮౭

ఉ. పేరిమి తమ్మితేఁటి వల ♦ పింపగ వెన్నెసయన్వలంతి సొం
పారిచఁ చీరఁదాలిచి యొ ♦ యారపుఁ జేగురువారు కెంపులన్
గూరుచు సొమ్ముఁబెట్టుకొని ♦ క్రొత్తసిజాజుల కొప్పుబెట్టనో
నారహిమీర నేలయెలు ♦ నెనెఱసందెవెలింగి జొబ్బిలెన్. ౧౮౮

తే. గీ. తుంటవిల్తుండు బొజుగుల ♦ తుటుముగరువ
మణపనన విల్లునెత్తిన ♦ యలరు బెళుకొ
తేరునకుఁ గట్టుచిలుకల ♦ తేటుముక్కు
నీటుచాయల నగనొప్పె ♦ నీరుకాళ్లు. ౧౮౯

చ. కలువబొజుంగునా తెలిమె ♦ కంబుల రాయఁడు వేడ్కఁ బుట్టుగు
బ్బలిగ వినుండిలేచి తన ♦ వాడివెలుంగగు చేతిగోరులన్
నిలువక చీకటేనుఁగును నెత్తినఁ ♦ గొట్టిన తెల్లి రాలుని
గ్గులుగల ముత్తియంబులను ♦ కొప్పునచుక్కలు వెల్గె తళ్కునన్.

చ. విరిపడిఁ బొటి గుబ్బలిగ ♦ విన్నెటితావులఁ దూటియుండి బి
త్తరమునుఁగల్గు ప్రొద్దుతురి ♦ తంబున గ్రుంకుడు మెట్టుఁజేరిన

న్బారిపురివెచ్చ గాంద్రకుచు ♦ మ్రుచ్చులకానలుఁ బుట్టఁదట్టగా
నిరులటు సిక్కిపిక్కటిలె నేప్పడ ♦ నేరకడ్రంత మిట్టుయున్. ౧౫౧

మ. వెలియింతైనను లేక మొజ్జగములుం ♦ పెంజీకటుల్గ్రిమ్మన
త్తలలోనన్ గొమ రాంద్రొగిన్మగలతో ♦ దార్కొణఁగా వూలనె
జ్జలపై గూడి పరుండనేసి మనహో ♦ చ్చన్ మిండఁడంజేరి గ్రం
తలహో ఋన్మరుకాచెయ్యులన్మెలఁగియుం ♦ తం బో ఋ రిల్ జేరఁగన్.

సీ. మరుఁడు దెరవరుల ♦ మది కొనలం గాల్ప
కుప్పఁగా నిల్పిన ♦ నిప్పులనఁగ
విటకాండ్రపై దాడి ♦ వెడలెడు వెడరాఁయు
గ్రొల్లైనపై షాణన్ను ♦ కుండయనఁగ
వలపుకాండ్రను మెక ♦ ములపైన వేఁటాడ
దెచ్చిన ననపిల్లు ♦ దీమమనఁగ
వలజేఁడు వలఁగల ♦ వారిగాఁ తనుతీఁగి
యలఁ ద్రెంపనెత్తిన ♦ యలరుగుడుసు

గీ. వాలనఁగ యెట్టదనమయి ♦ వన్నెనున్ను
వరలి తేజులఁగలదియై ♦ వట్రువయయి
పొడుపుగుబ్బలి కొప్పుపై ♦ బొడిచెనండు
బాజు లలరిన చందురు ♦ డోజఁగలిగి. ౧౫౩

ఆ. వె. చందమామ యాక ♦ నము నెక్కఁ దెసలను
వెల్లఁదనముఁ గలుఁగు ♦ వెలుఁగు లేరు
పడియె నలువగ్రుడ్డు ♦ వడిగ నిండినకప్పు
రంబు క్రోవివస గ ♦ నంబడియెను. ౧౫౪

వ. మఱియు నప్పొడుపుకొండనుండి కొమరాలెండుఁ బుట్టిన వేఁడుకను
నాకసము నొరయు తరఁగలచే మమ్మతిల్లు పాలసందరంబు వెల్లి
వొడిచి పుడమి కడువడి యెల్లెడల నల్లుకొనియెనన నంతకంతకు

లెక్కలేనిదియై యెనిమిదిక్కులఁ దలుముఁబడి మిన్నేటి సెలయే
రులనుండి పైడికూఁతాలి వలంతికిం గిన్నరాయంచల సోఁగుల
కూడిరి తగ్గులేని పుటపుటనలిచ్చిన తెల్లఁగలువల ప్రోగులుం గల
కేళాకూళులం జెంగటను పొదలాడుచు శేలగామువామియును
గవియఁను జొప్పుట యబ్బెసంబునుంబోలె మేడలదాపు నుర
తాణి కతవంపు గుంద్రని కిటికీలందూఱు ఘటే చీఁకటి క్రొక్కారు
తుద యగుటవలన తెల్లు పెంపారి పూచెనోయన విరివిఁగల
వెల్లువల నొడ్డులం గ్రాలుచు ననలచాలుల పోలిక నేలపుట్టుఁగుల
తీవియల యాకులం దళతళరువాణంబుల వెలయుచు కొదమసిం
గపు కూనలతీరున క్రొండక్రొంబంబు లెక్కుచు మనఁజెలంగ జల
కంబునం దేలియాడు వాలుఁగల మేలగు బెళుకులంబోలి సోయ
గంబున నందంబుగల పెన్నేటితరగల చెలువారి యలచందిరిక
మిక్కిలి గరగరగల తెల్లని చెన్నుగలదియై వెన్నెలపులుంగుల
నోట నెరయుచు చందమామనీడులోఁ గల తేటివాయినుండి
నెమరువేయఁగ జారిన మిక్కిలి ముమ్మతిల్లు నురుగుపుంజిక వరుస
నేర్పాటుగల పువ్వుటీరంబులపయిం దిరువులాడుచు కమ్మనితావి
వెదజల్లెడుననుచు మల్లెపూగుత్తుల సంతోసంబు రెట్టింప సిట్టట్లు
తొలుదొల్త కూడికచే నలసి వలపుకాండ్రను నీసడించి పైకూ
టమి నెఱుపు తెఱవలఁ సుగముజాఱుచు వ్వరువాణంబుల తెఱం
గునన్ కురంగట కరంగి తొరఁగు నెలకల కిట్టడంపునేల జలజలం
జాఱుచుండు వెల్లఁ దనంపునీటి తళుకుల్లం గలసి కూడుకొనుచు
రింగున న్నెగసి వినుదారిరంగారు నేల కొడుకుగామువగడంపు
రిక్కలు గోలెగాములు రిక్కలింగంబులని గుటుకు గుటుక్కున
మ్రింగ గడంగుతఱి పెద్దగా గుఱియుమనుచు వెల్లువ వరుస నీటి
దారకు నింపుగా గుంపులై యాకసంబున క్షుత్తుకగొలఁది ద్రావి

క్రిక్కిరియున్నాఁబట్టి యొక్కటి కొక్కటి కందిచ్చుచు
విచ్చలవిడిన మచ్చికలం గలయు నెలఁదావుల నొయ్యారంబును
నాలుమగలు పటికపుకోరల నొమ్మనలుంచిన నారికడము కల్లునా
నచే బుచ్చుకొని దాని రిమ్మవలన గలుగుకొన్న సంతోసంబు
సంతడింప వినువారి వీనుల కింపగునటుల బాడు నెక్కువతక్కువ
పాటలచేత డబ్బాటుకూటల నక్కజంబు పొందించు నాటలచే
వంకరలగు చూపుసేతల లలించు వైనములేని చిరునవ్వులం
జెలంగి మెలంగుచు తెలివంటి పరాకుపదిలి మైకలుఁజెంది నొకరి
కొకరు ప్రేముడిసేయుచు రతినపుటందియలు మ్రోతమ్రోయఁగా
పుప్పవు పెద్దపువ్వులకుం బోయి తోటనుండు కమ్మతెమ్మరలు
వీఁచి, కుతినీపయ్యెదలు దోలంగింపకయున్న జారిపోవ న్యసువు
పచ్చని నిమ్మకాయలవమపునం బొంగారు లేకులుకుగుబ్బ గవలం
దళతళలాడునట్లు గాన్పించు సొగసైనపౌడ లుబ్బుకొనం దబ్బిబ్బు
లెడలం దబ్బున కౌగిలించు మెఱఁగుఁబోడుల కన్నవలకొనల గప
లుచున్న మెఱుంగులు రాణించు సింగారపు సేతలకు సంతసించు
ప్రేముడి మగలతో పెనుగులాఁడి పలువితంబుల కూటములన్
గల నేరుపులతో చేరి మునునిదురంబున సయ్యాటలాడి తొంప
చుండు నవ్వాడు సోయగంబుచే తళతళక్కుమని గ్రాలెడు మగ
రాలదుద్దుల పాపెటఁ బొట్టు చకచకలతో చెలిమిసేయుచు నిట్టు
తగ్గులేని తెల్లని చాయలు పెంచుకొని మెండుగా పండువెన్నెలలు
గాయుచుండ మరుండు కరంబుగా విరికఱుకుటమ్ములు దురమ్ము
సేయ కినుకారదాయమై కమ్మతెమ్మెరలుదాయ నుల్లంబు జల్లు
జల్లుమని తల్లడిల్ల సిద్ధురనొంకర మిగుల మొత్తని జిగురుపాన్పు
నుండి డిగిచెరలాడు పెనుగాలిచే దూలి పూవతీఁగియమాదిరి
సోలుచు కుబ్జకన్నె కరతినంబు నతంబు మంతనంబున తలంపు

సేయు సిరిపెనిమిటియగు కన్నయ్య యొడలి సింగారంబు కన్నులఁ
గట్టినట్లైనఁ జూచితి చూచితని జ్వరునలేచి బయలం గౌఁగిలిం
చుచు నది వట్టిదైన కళవళించుచు నక్కటక్కటా మాల
దైవంబు కట్టడియయ్యె నేనేమి సేయుదుననుచు కన్నుంగవనుండి
జారుచున్న నీరు సెలయై యులర గడగడ వడఁకుచున్నంతలోన.

ఉ. అప్పుడు నల్లమేనిదొర ♦ యూరట మొందెను కుబ్జచెంతకున్
దెప్పునఁబోవఁగాఁ దలఁచి ♦ తీరగుపొమ్ములుఁ దాల్చి మేనసీ
టొప్పఁగ యుద్ధవుండనెడు ♦ నొక్క నిమిత్తనిఁ గూడిచేడమే
లుప్పరిగంబుత్రోవచెలు ♦ వొందగ నాతఁడుఁదీయుచుండగన్. ౧౫౭

క. చనిచని కట్టెమురంగను
గానెమరునిం గన్నతండ్రి ♦ కోల్కొను సారము
ల్దనలారు వీనెవిద్దెన్
జిగిరవల వెలుంగుగద్దె ♦ చెలువఁగు మిద్దెన్. ౧౫౮

వ. కనిలోఁ గిలికింజనిన నచ్చేడియ యెదురుఁగా నడచి హారునంబు
బుద్దిలో బెనంగొన నక్కటివేల్పునంజదమ్ముల వన్నిటి జలకంబు
నంగడిగి సన్నని దువ్వాలువచే దడియొత్తి నిద్దాబంగరు రతనాల
గద్దియపైఁ గూరుచుండబెట్టి వెంబడించివచ్చిన యుద్ధవుండనెడు
నేస్తకానికిఁ దగిన పూజలొనరించి దురబండులు మొదలగు
మేలోగిరంబుల సాపడంబెట్టి నెచ్చెలులతో నచ్చెలువ యార
గించి మరియు, ౧౫౯

క. జవ్వాది కప్పురపుకడి
నివ్వటిలం జెమ్మలందు ♦ నెఱిదివ్వెలతో

మవ్వముఁగల పడుకఁగదిన్
జివ్వన కరివేల్పుతోడఁ ♦ జేరెఁ జెలువయున్. ౧౫౯

వ. ఇట్లు నవ్వుకుకఁగది మ్రోలకరిగి వెండియు, ౧౬౦

చ. పగడపుకోళ్ల మంచమును ♦ బల్కుఁతి సీపనిమించు పాన్పుపై
నిగనిగలాడు దోమతెర ♦ నిక్కఁగ చక్కని నిల్వుటద్దము
లొప్పఁగనగు మెత్తలుఁదిండ్లుఁగల ♦ సూదినిచందువ ముత్తియంపుచే
ర్లుఁగలిగి తేజునొందులలి ♦ లోఁగిలికింజని చూచిరవ్వడున్. ౧౬౧

సీ. మంచిగందపుకోర ♦ మరిజాలవల్లిక
వట్టివేళ్లసురంటి ♦ వన్నెగదుర
జవ్వాదివక్కణి ♦ సంపెంగినూనె గిం
డులుపిల్లిగడ్డలు ♦ తళతళమను
సిరిమించు రతనాల ♦ చిలుకల దివ్వెకం
బంబులు కప్రపుఁ ♦ బరణివచ్చి
కస్తురిపెట్టెయు ♦ కాళంజికడిగల
వన్నెఁటిక్రోవియు పసిఁడిపీట

గీ. బలితమగునేన్ను వలుతోటి ♦ పనిదనర్చు
దువ్వెనక డానిచెంబులు ♦ నిప్పటిలిన
పడుకటిలుఁజూచి కన్నుల ♦ పండువైన
వచ్చరామెట్లుఁగలపూల ♦ పాన్పుఁజేరి. ౧౬౨

శా. దయ్యంబోకటివేల్పు కుబ్జయొపనే ♦ దందీర కేల్దమ్మితో
నొయ్యారంబు నకౌఁగిలించి తమితో ♦ నోజన్నునుం బల్కులన్

వెయ్యార్లాడుచు సోబియంబు గుంకక ♦ న్వేఁదిత్యువిల్దారిమేల్
కయ్యంబున్వివరింప మెచ్చుకొనియె ♦ న్గాదారి మూఁదారిలోన్.

క. పొక్కిలిచన్గవ కుత్తుక
చెక్కిలికెమ్మోవి కనులఁ ♦ జెవ్వఁపుమోమున్
నిక్కువముగ ముద్దులుఁగొని
చక్కఁగ తమయిచ్చసుగముఁ ♦ జరిపెను తలలో. ౧౬౪

చ. సరివయికూటమిం జెలువ ♦ నల్పుచునుండఁగ వింతవేలుపుం
దెరవసియాడె చుక్కలొగి ♦ తిన్నసపిడ్వడి చిక్కులొందె సం
బరమున గట్టులున్వడికె ♦ బన్మరుచందురుఁగప్పె మబ్బుల
చ్చెరువుగనీరుబొట్లువడి♦ సెన్మతిమించులుమించెనాడుచున్. ౧౬౫

తే. గీ. ఇటుల పలువితాల ♦ హెచ్చుగ వలపుల
కలయికలనుఁ దేలి ♦ కలికికతియు
మేనివేల్పుతోడ ♦ మెత్తని నడువుల
చెంగనాలుఁదాను ♦ జేసిపలికె. ౧౬౬

తే. గీ. నీదుచిట్టంటువుల చేత ♦ నీదుమేని
వలపులకు నాదుడెందంబు ♦ వరగలించె
నన్నికోరికలీయక ♦ న్నయ్య తగును
వేరువేలుపు లిట్లుగా ♦ వింపఁగలరె. ౧౬౭

మ. లలియా నీయొడలిం దలంచి సిరివా ♦ లాయంబు నిన్వేఁడు కొం
దులకో నేనిమునంబు నిన్నువిడువన్ ♦ తోరంపు వూపిల్తు విం
దులలోనిండిన వేడ్కఁజూపి వలపు ♦ ల్దోఁగియంగ నీకల్మికిన్
దులలేదే వివరింపగా నలవియే ♦ తోడ్తోడ నీసత్తువన్. ౧౬౮

తే. గీ. కాననేఁ గోరుకోర్కెలఁ ♦ గలుఁగఁజేసి
మనువుమని వేఁడుకొనెనన ♦ మారుపాటు
నొందియడిగిన కుబ్జను ♦ డెందమందు
కట్టిమనుమఁడు రుసికి న ♦ క్కజముఁగనెనె. ౧౬౯

ఆ. వె. పోరుతిండి తపసి ♦ మొదలుగాగల రసు
లెదనుఁదలఁచి చూడ ♦ కుదురులేని
వేల్పు నెట్లుగోరె ♦ వెలఁదుక విరివిల్తు
పోరఁగవయు నట్టు ♦ లోరుసిలలి. ౧౭౦

క. దొరకఁడు సిరికౌఁగిటిలో
దొరకండలఁ జోగికలువ ♦ దొరలకు నెపుడున్
దొరకఁడు వేల్పులకైనను
దొరికెన్వలరాయు తండ్రి ♦ తొయ్యలికి నొగిన్ ౧౭౧

క. తొలిచదువుల కందసియా
తొలిమాఁసిసి జేజెజేజె ♦ దొరికిన యంతన్
దెలివిఁగల ముగితిఁగోరక
నలరాచ పనిన్మొలంగ ♦ వలెనని గోరెన్. ౧౭౨

ఆ. వె. పిల్లతనములోన ♦ పెంచిన తల్లిచే
కట్లుబడిన యట్లు ♦ కనికరమున
లేమకౌఁగిలింత ♦ లోమిన్నయైఁ జిక్కె
నేమిపునెమొ తొల్లి ♦ నోములేనొ. ౧౭౩

ఆ. వె. ముజ్జగంబులేలు ♦ ముప్పొకలానిని
కోరుకున్న చెలికి ♦ కోర్కెలిచ్చి

గాచుకొనెనొ లేక ♦ కసటునసుంచెనొ
తెలియఁబలుకు మనిన ♦ దిరిగినుడివె. ౧౭౪

ఉ. నీ వనుమాటలన్నియును నిక్కము ♦ బత్తులబత్తి నెడ్దలో
గావఁగ నీవెయంచనెడు ♦ కర్నమున్నియు నంతలోవలన్
బోవకయుండునే యతని ♦ బుద్ధిసిగల్గిన కోర్కెలీయకే
దేవరయుండు నేమనకు ♦ తెల్లముగావలవేల్పు చెయ్దముల్. ౧౭౫

ఆ. వె. ఔరవాని చెట్ట ♦ నమరఁగఁ బట్టిన
గొల్లకన్నెకలును ♦ గొనిరి ముగితి
యతఁడు కేలబట్టి ♦ సతముఁబ్రోచెడు వారి
కరయు కలుసమన్న ♦ నలనుఁగలడె. ౧౭౬

ఆ. వె. చుట్టమయ్యెఁగాని ♦ సూడు చేతనుగాని
కలఁతనైనఁగాని ♦ కలసిఁగాని
బగితినైనఁగాని ♦ బల్మొరువానితో
పొందుసేయఁగలుఁగు ♦ ముందు ముగితి. ౧౭౭

క. మునుకలవమియ్యా తనుదా
ల్చిన ప్రేముడిపెను కులాడ ♦ చినిమగవనిలో
తనిసననుండు మటంచని
వినిపించిన నంతసించి ♦ వెన్నుడు వేడ్కన్. ౧౭౮

ఉ. కోరినకోర్కె లిత్తునని ♦ కుబ్జకువెన్నుఁడు నిండువేడ్కపెం
పారఁగ బల్సగంబులను ♦ హోళిసెలంగఁగ గబ్బిగుబ్బలన్
బోరున నంటకౌఁగిలిడి ♦ పూవిలుకానికదురంబుపైనమున్
మేరలచాలఁ దెల్పిచెలి ♦ మిన్ననుఁగూడి వరుండె నంతటన్. ౧౭౯

చ. కలువలు మోముమూసె కడ ♦ గండ్లకు తావగు చంపమావు
ల్గులమదిరోసె, జక్కవల ♦ గోములఁబోవిడి క్రేఁగసేసె చు
క్కలగమిమాసె, తామరలు ♦ క్రన్నన బాసె, బిరానకోడి కుం
పుఁగఁ దమిఁగూసె పక్కులటు ♦ పోఁడిమి చెట్లనుఁ బాసె సంకటన్.

మ. కుఱుకున్నిద్దపు చెక్కుటన్మొగము ♦ నొక్కల్ వేసలిగ్రాచిత
మ్ముల్లములల్లాఁ బ్రకిలించి బోకమిడులం ♦ బొంకంబుగా గట్టిని
చ్చలు సొంపొంపఁగ ముంగుఱుల్మిమిరియి ♦ చ్చన్గంకియుం గోరన
త్తలబీతిన్వ్రాకి పాన్పులండిగిరి జేం ♦ ద్లంచాలు లేయుంచొగిన్. ౧౮౧

తే. గీ. పాయమును గల్గుతమ్మిమే ♦ ల్రాయని మది
మెచ్చిరే రాజవినుచెలి ♦ మిన్నముదుక
డనుచు క్రిందుగ బడద్రొబ్బి ♦ నల్లమామ
పాఁతెపడమటి కొండపై ♦ బాజులెడలి. ౧౮౨

క. గందపు మలనెత్తమ్ముల
కందువమేత్రీవయిండ్ల ♦ కడివిరి పాన్పున్
జెంది సుగించిన చెంచుల
యందపుచన్గవ జవాది ♦ యంది సురలొగిన్. ౧౮౩

క. తారాడుచుండ పజలను
కూరుకు విడనాడి మేలు ♦ కొనుటకు తానే
కోరికలేపెడు వాడన
తూరుపుఁదెస వేఁగుజుక్క ♦ తురుతునఁ బొడిచెన్. ౧౮౪

తే. గీ. బమ్మచారులు మొదలైన ♦ బాపలెల్ల
మేలుకాంచి సతంబును ♦ మెలఁగదగిన

నేతలను తానమాడియు ♦ నేమములర
సందెగిడిగిల్లు సలిపిరి ♦ సరిఁగబగితి. ౧౫౫

తే. గీ. చెలియకుబ్జను కన్నెయ్య ♦ చేరిమరుని
రంతులనుదెల్పి నిమిరించె ♦ రాసఁజెలఁగ
మేలుకొలుపఁగఁ దగునని ♦ మించివచ్చి
కొక్కొరకొయంచు కోళ్లటఁ ♦ గూసె పెలుచ. ౧౫౬

ఆ. వె. వినుతకొడుకుఁ గలుఁగ ♦ వెలసిన యురదము
తోడసిరివెలుంగ ♦ తొడరుబాయ
నందితూర్పు కొండ ♦ నలరె ముప్పోకల
తారుచున్న వేల్పు ♦ తళుకులెసఁగ. ౧౫౭

ఆ. వె. ప్రొద్దుఁబొడువ తమ్మి ♦ పొక్కిలి మేల్కొని
తానమాడుపనుల ♦ తమకమునను
దీర్చి సుగముగదుర ♦ తిరుగుచు లేకల
కమినిఁబ్రోచు చుండె ♦ గారవమున. ౧౫౮

చ. కుమరితయైన కుబ్జయొకఁ ♦ గోరినయట్టుల వెన్నుఁడొంగ వ
చ్చి మరులుమాన్పి యింటఁబనఁ ♦ జేసినకోమలు డెంతొపిన్నవే
డ్క మది జెలంగ బత్తిమెఁయి ♦ కారును గడ్పుచు సంతసించియుం
డె మరుని గన్నతండిరికి ♦ డిందగు పేరుల నెంచి నెమ్మిగన్. ౧౫౯

మ. సనకుండు నొమ్దళైన జోగులెదలో ♦ సంతోసముంజెంది చూ
చినఁ గానంబడనట్టి వేల్పునకుఁ దా ♦ చేసన్నయింగల్గుచ
క్కని గంధంబుల నిచ్చినందులకు వే ♦ గవచ్చి మన్నించె ప్రొ
వ్వనవిల్లారిగలంచి నెల్తుకనురా ♦ సంగొన్ని నాళ్ళుండియున్. ౧౬౦

చ. ఇటువలె కుబ్జవెన్నునకు ♦ నేడ్తెఱఁబాని సెచెయ్వులెల్ల యూ
రటఁగొనకే యొనర్చుచుత ♦ రల్పగ సత్తువలేని బాగముల్

బటువుగనొంది పాటలర ♦ వాళులు హెచ్చఁగ సెజ్జగీములో
చిటిపొటిమాట లన్నొగని ♦ చిక్కనిరంతులఁ జిక్కియుండఁగన్.

క. ఏ వేసట లేకుండఁగ
పూవిల్తుని పోరులోనఁ ♦ బూవిల్తునకున్
బూవిల్తుఁడైన కన్నయ
తో వేసకనుండె కొడుకు ♦ తొరలుట కొరకై. ౧౯౨

సీ. కన్నయ్యనిబ్బరి ♦ కనుఁజూపులో కుబ్జ
పడఁతికి దనయొక్క ♦ పొలువలన
మంచికారున నెల ♦ మనలెనుగొంతికి
మోమున తెలుపెక్కె ♦ ముదుతవిప్పె
బొజ్జను తడఁబడె ♦ బుడిబుడి నడ[illegible]లు
కోర్కులు మెండ[illegible]కె ♦ కులుకులెడలె
బోనముపై యిచ్చ ♦ బొత్తిఁగ లేదయ్యె
చిట్టుముల్బలిసెను ♦ చిట్టుకముఁగ

గీ. వంగడము నిల్పుటకు నయి ♦ వరలుచున్న
కొమరితనుఁ జూచి కములియు ♦ కోమలుండు
సంతసంబను సంద్రము ♦ నొంతొనోల
లాడిరి నెలంత వేవిళ్ల ♦ తోడ మెలఁగె. ౧౯౩

వ. ఇట్లు తొమ్మిది నెలలు జరుగునంత నొక్కసోబన మూరుతమ్మున గాములు తమతమ సొంతపుతావులను మూడాసువదనకొండ వతానకంబుల కొందరుండ నొక్కకొమారుండుఁ గలిగె నతనికి పెద్దల నొడబాటుచే నుపశ్లోకుండను పేరుతో నలరారె వాఁడుఁ దన తండిరియైన కన్నయ్య యడుగుఁదమ్ములఁ గొలుచుచు నాశ్వేరవురుసిచందురునకుఁ జట్టై బానిసముఁ గావించుచు మిక్కిలి

యక్కజంబుగాఁ దెలియందగిన తెలివినిఁ దెలిసి యతం డాఁడు వారిని నాలవకొలంబువారిని బానిసె మొదలగు పజలకుఁ జక్కఁ జేయఁదగినదిగాు మిక్కిలి తలంచినంతనే ముగితిం గలుఁగనేయు నట్టి (సాత్వతతంత్రంబను వైష్ణవస్మృతి) యనెడు పొత్తముఁగలిగించె. నదిమొదలు నేటివరకు కన్నయ్య బగిలిఁగలవారికి విడువరాని పాడిగాు నలరారె. కావున నీ కతరతనము సేరికై ననుడివిన నుడువగవినిన చెప్పించిన బాగెముఁగలవారికి వెన్నుండున్న మొల్నాడు గలుగును. ౧౯౪

వ. అనుచు శుకుడుకిట్టి ♦ మానుమ్మనికిని కుబ్జ
కతను నునువులైన ♦ కమ్మనైన
నుడువులడరఁజెప్పె ♦ కర [illegible] వరితీఁ౦త్తుండు
చెవులు చవులునొ[illegible] [illegible]జలిసె. ౧౯౫

సోబనములు నరసింగా
సోబనములు వేల్పుగొండ ♦ సుద్దిగలబసా
సోబనము లచ్చిజేడా
సోబనములు వేల్పుపెద్ద ♦ చూలిపొగడ్తా. ౧౯౬

అడుగులజాలుకుందనపు ♦ టందపుసాలుకడిందిము త్తికం
బొడవగుప్రోలుతమ్మినెల ♦ వుంగలనెల్తుకయాలుఁబత్తులం
గడువడిఁబ్రోచుకేలుబరి ♦ గండడగించెడు చుట్టువాలుమై
బెడగుల ప్రబ్బుతాలు గల ♦ ప్రెగ్గడరక్కసిమాత్తి సింగమా. ౧౯౭

(తోటకవృత్తము)

తొగకంటువు కం ♦ దుడుదేవరలు
న్నొగడ నృతనం ♦ బుల పోణిమనం
దగువేలుపు గొం ♦ డను తానకమై
మిగుల న్వొలిఁజిమ్మ ♦ న మేల్చిరుదా. ౧౯౮

(౧౯౬౯ విక్రమార్క శకం).

క. కననవమణ్ణ వశశిసం
ఖ్యనిగుడఁగల విక్రమార్క హాయనమున సా
గెనుకీలకమాఖ సితచతు
ర్థిని నీకవితను ముగించి తిని మెచ్చ బుధుల్.

( గద్య. )

ఇది శ్రీమద్రమాంగనాంగ మందారలతోత్తుంగ స్తన స్తబక
శృంగార భృంగాయమాన లక్ష్మీ నృసింహకృపాలబ్ధ వాగ్వి
భవ భగవద్భాగవతార్చనాతత్పర చతుర్విధ కవితా
పరిబంధ నిర్మాణచాతుర్య ధురీణ ఆంధ్రభాషా
ప్రవీణ హరితసగోత్ర పవిత్ర రంగాచార్య
పుత్ర నల్లంతిఘల్ చక్రవర్తుల తంయ్యాల
లక్ష్మీనృసింహార్య కవినాథ ప్రణీతంబైన
అచ్చ తెనుఁగు కుబ్జాకృష్ణవిలాసం
బను సింగారకబ్బంబు నందు
తృతీయాశ్వాసము సర్వం
సంపూర్ణం శ్రీకృష్ణ
పరబ్రహ్మణేనమః
శ్రీమతేరా
మానుజా
య న
మః
శ్రీ